# తోడికోడలు

## లేక

# వేరింటి కాపురము.

(సాంఘిక నవల)

గ్రంథకర్త:

కేతవరపు రామకృష్ణశాస్త్రిగారు.

పబ్లిషర్సు:

కురుకూరి సుబ్బారావు అండ్ సన్.

ప్రొప్రయిటర్సు:

సరస్వతీ బుక్ డిపో,

బెజవాడ.

మొదటికూర్పు 1000 ప్రతులు.

రాజమండ్రి.

సుజనరంజనీ ముద్రాక్షరశాలయందు

ముద్రింపబడియె.

1989

# విషయసూచిక.

# తోడికోడలు

## (లేక)

# వేరింటికాపురము

### మొదటి ప్రకరణము.

—:0:—

## నామాట

"ఇదిగో! నామాటను వినండి. వెనుక నేను మీతో చెప్పిన విషయమునుగూర్చి ఏమి యోజించినారు?

"కానిమ్ము. ఇప్పు డంత తొందర యేల?

"మీ రెప్పుడు నీమాటనే చెప్పుచున్నారు. ఈవిధముగ రెండు సంవత్సరములు గడచినవి. ఇదివరలో చెప్పినప్పుడు ముదుసలితల్లి జీవించియుండగా వేరుపడుట మంచిదికాదు అని చెప్పి కాలము జరిపినారు. ఇప్పు డామె పోయినది. ఆమెయొక్క యంత్యక్రియలుకూడ పూర్తియైనవి. ఇప్పుడైన నామాటను విని మనము వేరుపడు విధానము యోజింపుము.

"నే నింటి కిప్పుడు పెద్దవాడను. నీవు పెద్దకోడల వగుటచే గృహమునకు యజమానురాలవు. ఇట్టిసమయమున-అందునను పెద్దతల్లి పోయిన వెంటనే గోవిందుని వేరుజేసినయెడల లోకు లేమని యెదరో తెలియునా? పెద్దకోడల పెత్తనము వచ్చునప్పటికి సంసారములు వేరుపడినవని నిందింతురు.

"ఇందువలన మన కేమి నష్టము. లోకులు తమ నోటికి వచ్చినట్లు మాట్లాడుటయేగాని ఎదుటవారి కష్టములనుగూర్చి వారు విచారింతురా? మన మంచిచెడ్డలనుగూర్చి మనమే యోజించుకొనవలయును. మీరింక నెలకు తీసికొనివచ్చుచున్న రెండువందల రూపాయలలో నొక్క రూపాయికూడ మిగులుటలేదు. అనవసరమైన ఖర్చులతో సంసారము గుల్ల యగుచున్నది. మన సంసార పరిస్థితులను జూచి మా తల్లి యొకనాడు నాతో నీభర్తకు గల సంపాదన మీతండ్రిగారికున్నచో నే నొక జమీను (ఎస్టేటు) ను కొనియుందునని చెప్పినది.

"వారి పోషణమునకు కలుగు వ్యయ మంతయును భరించుట నా ధర్మము. కారణ మేమనగా? గోవిందుడు నా సోదరుడు. అతడు నౌకరీ చేయుచున్నప్పుడు జీతములో నొక్క పైసయైనను మిగుల్చుకొనక నాచేతికిచ్చెను.

ఇంతేగాక మరియొక సంగతి. నే నొనర్చిన పొరబాటును గోవిందుడు తనపై బెట్టుకొని కచేరిలో అధికారులవలన నాకు రావలసిన శిక్షను తా ననుభవించి నా గౌరవమును నిలువబెట్టెను. ఇందులకై యతడు ఉద్యోగమును కోల్పోయెను. నే నాతని మంచితనమునయిన గ్రహింపక వేరుచేసినచో భగవంతుడు సంతసింపడు.

"మీ యభిప్రాయము నాకు నచ్చలేదు. ఇదివరలో ననేక మారులు చెప్పియుంటిని. మరల చెప్పుచుంటిని. మనకు నిద్దరు పుత్రు లున్నారు. వారి మంచిచెడ్డల నరయవలయును. వారికి వివాహములు చేయవలయును. ఇతరులకుగా మనము నష్టపడుటెంత యవివేకమో గ్రహించితిరా? ఇక్కడికి రెండు నెలలనుండి కుటుంబవ్యయమంతయు మీరే భరించుచున్నారు. తమ్మునిపై

యభిమానముచే నీకుటుంబవ్యయ మెంతకాలము భరింతురు ? నా మాటను విని తెలివితక్కువను పడక మీతమ్ముని బిలిచి స్పష్టముగ జెప్పివేయుడు.

"ఈసమయములో నేను వానిని వేరు చేయజాలను.

"మీరు చేయలేని యెడల తోడికోడలను బిలిచి నేనే చెప్పెదను.

"నీవేమియు చెప్పవలదు.

"అట్లయిన మీతమ్ముడు మరదలు మొదలగు వారితో గలిసి మీరుండుడు నేను మా పుట్టింటికి బోయెదను.

"మాటమాటకు కోపించెదవేల ? నేనును వేరు పడుటకే యోజించుచున్నాను. కాని యింకను నాలుగైదు దినము లాగవలయును.

"మరియొక సంగతిని వినుము. సంబంధములేని యాహారపు బంధువులయిన వితంతువులను మీతమ్మునితో జెప్పి పంపివేయుడు. వీరి నందరిని కూర్చుండబెట్టి పోషించు బాధ్యత మన కేల? తక్షణము పంపివేయుడు. ఈపనినైన చేయగలరా? అందులకును భయమేనా ?

"నే నిప్పుడే వానితో చెప్పి వారినందరిని పంపివైచెదను.

"నే నెప్పుడును మీ క్షేమము పిల్లల క్షేమము గోరి చెప్పుచుందును. నా మాటను విని యట్లు చేయుడు దానివలన కలుగు లాభమును మీరే గ్రహింతురు. ఇందులకు మీ తమ్ము డంగీకరించెనా సరియే. లేకున్న నతనికి మార్గమును చూచుకొనుమని చెప్పివేయుడు. చిక్కు తీరిపోవును.

రెండవ ప్రకరణము

—:o:—

# పరిచయము

పూర్ణిమనాడు రాత్రి మేడ పైయంతస్థునగల గదిలో దంపతుల కిర్వురకును పై ప్రకరణమున వ్రాయబడిన సంభాషణము జరుగుచుండెను. దంపతులలో భర్త పేరు గోపాలచంద్రబాబు. ఇతడు బర్ద్వాన్ జిల్లాలోని సోనాపూర్ గ్రామములోని ధనవంతుడును గౌరవనీయుడయిన శ్యామసుందరవంద్యోపాధ్యాయుని జ్యేష్ఠ పుత్రుడు. దానము - పరోపకారము - దయ- ధ్యానము-మొదలగు సద్గుణసంపత్తిగలవా డగుటచే శ్యామసుందరునియం దందరును గౌరవముతో మెలంగెడివారు. అనాథలగు వితంతుజనము నతడు యథాశక్తి నాదరించెడివాడు. తుదకు తన యేబదవ సంవత్సరమున శ్యామసుందరుడు ఇర్వురు పుత్రులను, ఒక కుమార్తెను, భార్యను, తా నార్జించిన యశస్సును భూమిలోబరిత్యజించి స్వర్గస్థు డయ్యెను. తరువాత రెండు సంవత్సరములకు భార్యయు పరలోక మలంకరించెను. పెద్దకుమారునిపేరు గోపాలచంద్రుడు. చిన్నకొమరునిపేరు గోవింద చంద్రుడు. శ్యామసుందరుడు విశేషధనము నార్జించి సార్థకముగ వ్యయముజేసి మిగిలినదానిని కొమరుల కప్పగించి చనిపోయెను. ఆధన మంతయు జ్యేష్ఠపుత్రుడగు గోపాలచంద్రుని హస్తగత మయ్యెను. గోవిందచంద్రుడు విద్యావంతుడై సోదరునియందు భక్తిశ్రద్ధలు గలవా డగుటచే సర్వదా తన యన్న కనుచరుడై కాలము గడుపుచుండెను. గోపాలచంద్రు డింటికి యజమాని యగుటచే గృహకార్యనిర్వహణమున నతనికి గోవిందుని యాటంక మేమియును లేదు.

స్వర్గస్థుఁడయిన శ్యామసుందరుఁడొక్క గొప్ప వ్యాపార కార్యస్థానమున నున్నయుద్యోగమునుండి భక్తివిశ్వాసములతో పైవారి యాజ్ఞల బాలించుచు పని చేయుటచే నతని కుపకారవేతనము లభించెను. తసుపరి కార్యస్థానప్రధానకర్మచారి (Manager) తో జెప్పి తన కొమరుల కిద్దరకు నుద్యోగముల నిప్పించెను. ఆఫీసు మేనేజరు సజ్జనుఁడు-దయాళువు-గావున శ్యామసుందరుని మరణానంతరము నుపకారవేతనమును కట్టిపెట్టి గోపాలచంద్రునకు రు 200 లును గోవిందునకు రు 100 లును నెలజీత మిచ్చుచుండెను. గోపాలచంద్రున కొక్కమారుగ నెలకు రెండువందలు చేతికి వచ్చుచుండుటచే నతని యానందము మిన్నుముట్టెను. వృద్ధురాలగు తల్లిని సేవించుట మాని భార్యకు విలువగల చీరలు రవికలు నగలు చేయించుటలో మునిగిపోయెను. గోవిందచంద్రుఁడు బాల్యము నుండియు పెద్దలయాజ్ఞ కడుగు దాటనివాఁడగుటచేతను స్వయముగ మాతృసేవ జేయుటయేగాక తన భార్యకుగూడ పెద్దలను సేవించు విధానమును బోధించి మాతృసేవకై నియోగించెను. ప్రతిదినము మాతృసేవ-మాతృవందనము జేయక నీరయినను త్రాగఁడు. పెద్దకోడలు భర్తృప్రేమైక సర్వస్వయగుటచే నామె కత్తగారి పరిచర్యయన్న సేవగింపుగనుండుటచే నాముదుసలిని కంటనయిన జూడదు. పాపమా వృద్ధురాలు చిన్నకోడలి సేవచే బ్రహ్మానందపడుచుండును. చిన్నకోడలన్న నామె కభిమానమనియు తన్ను జూచిన గిట్టదని పెద్దకోడ లత్తగారిని నిందించుచుండును. ఈవిధముగ శ్యామసుందర వంద్యోపాధ్యాయుని శాంతిమయకుటుంబమున గల్లోలము ప్రారంభమయ్యెను. గోపాలచంద్రుడు చూచుచుండియు నేమియు నెఱుంగనట్లూరకుండుటచే కుటుంబమును తండ్రినాటనుండియు నాశ్రయించియున్న యాశ్రితులు కొంతమంది మెల్లమెల్లగ నాయింటినుండి

సర్దుకొనిరి. అట్లు సర్దుకొనినవారిలో శ్యామసుందరుని కుమార్తెయు నామె భర్తయు నగ్రగణ్యులు. కారణ మేమనగా పెద్దకోడలు పెట్టుచున్న జగడములకు సహింపజాలక యొకనాడాడుబిడ్డ (గోపాలచంద్రుని చెల్లెలు) వదినగారిని మందలించెను. దానితో పెద్దకోడలు కోపధరిత్రియై తీవ్రముగ పోట్లాడెను. ఆపోట్లాటలో గోపాలచంద్రుడు భార్యపక్షము నవలంబించెను. చెల్లెలిని తూలనాడెను. దానితో నామెకు కోపము వచ్చి పుట్టినయిల్లు వదలి యత్తవారింటికి బోయెను. తల్లిమాటచే గోవిందు డొకటి రెండు మార్లు వెళ్లి చెల్లెలిని రమ్మని పిలిచెను గాని యామె గోపాలుని యవమానవాక్యములను జ్ఞాపక మొనర్చి నే నటకు రానని నిష్కర్షగ జెప్పివైచెను. తల్లి యీవార్తను విని కన్నీరు నించెను. కుమారుల నిద్దరను బిలిచి తాను జీవించియున్నంతకాలము మీరు పరస్పరము కలహింపక శాంతితో భ్రాతృస్నేహమున వర్తిల్లుడు. మీ భార్యలలో సోదరీవాత్సల్యమును బెంపొందింపుడు. అని చెప్పెను. గోపాలబాబు తల్లిమాటల కెదురాడలేక యందుల కంగీకరించెను.

ఇప్పుడు తల్లి మరణించినది. ఆమెమాట లామెతోడనే యంతరించినవి. శ్యామసుందరునికాలమున ధర్మమునకు బేరుపడిన యిల్లగుటచే నిప్పటికిని పెక్కుమంది యాచకులు దీనులువచ్చి నిరాశతో వెడలిపోవుచుండిరి. దయాధర్మములకాధారమైనయాగృహము నేడు పరస్పర విరోధములకు - కుటుంబకల్లోలములకు-మనస్స్పర్థలకు మూలమయినది. గృహయజమానురాలయిన పెద్దకోడలు నల్వురితో గలసి మెలసి యుండుట కిష్టపడక తనభర్తను కుటుంబములో నుండి వేరుపడుమని నిరంతరము బోధించుచుండెను. ఈవిధముగ పెద్దకోడలు గృహమున కలహబీజమును గాఢముగ నాటుటచే

భార్యయొక్క మహోపదేశమునకు బద్ధుడై గోపాలబాబు పరమ భక్తుడైన సోదరునితో దుర్వ్యవహార మొనర్చుచు కపటచిత్తుడయి యుండెను.

---

మూడవ ప్రకరణము.

:0:

# సోదరులు

నేడాదివారము. శ్యామసుందరబాబు జీవించియున్నప్పుడు ప్రతి భానువారమునను పెక్కుమంది దీనులకు నూటి గ్రుడ్డివారలకు ధర్మము చేయుపద్ధతి కలదు. పెక్కుమంది పేదబాలురు బాలికలు వచ్చి తమ కష్టపు జీవితమునుగూర్చి మొరపెట్టుకొని తగు సహాయముపొంది వెడలిపోవుచుండురు. శ్యామసుందరబాబు మరణించిన తరువాత గోపాలచంద్రు డాపద్ధతిని కట్టివేసెను గాని గోవిందచంద్రుడు మాత్రము తండ్రిగా రొసర్చిన ధర్మము కట్టుబడుట కిష్టములేక యథాశక్తిగ నడుపుచుండెను అందువలన పూర్వము వచ్చినంతసంఖ్య లేకపోయినను కొంతమంది దీనులు యాచకులు బిచ్చగాండ్రు బడులలో చదువుకొను పేదవిద్యార్థులు వచ్చి గోవిందునివలన సహాయమునుపొంది వెడలిపోవుచుందురు. అట్లనే నేడును యాచకబృందము గుంపులుగవచ్చి గుమ్మముముందు నిలువబడి ధర్మమునకై వేచియుండిరి. గోవిందచంద్రునకు రెండు నెలలనుండి నౌకరీ పోయినసంగతి పాఠకులు చదివియే యున్నారు. తాను స్వయముగ నొసంగుటకు శక్తిలేమి కుమారునిబిలిచి అన్నగారికి వార్త నంపెను.

రామచరణా! పెద్ద నాన్నగారిదగ్గిరకువెళ్ళి బిచ్చగాండ్రు ధర్మముకొఱకు చాలకాలమునుండి కనిపెట్టుకొని యున్నారనిచెప్పి శచీంద్రుని చదువుకొనుటకై పిలుచుకొనిరమ్ము. వాడీదినమున మామూలుగా చదువుకొనుట కేలరాలేదు?

రామచరణుకు తండ్రిమాటను విని లోపలికిబోయి గోపాలచంద్రుని జూచి తండ్రి చెప్పిన మాటలను చెప్పి ప్రక్కనున్న శచీంద్రుని జూచి అన్నయ్యా! నీవు మామూలుగా చదువుకొనుటకు రాలేదు. నాన్న పిలుచుచున్నాడు. రమ్ము అని చెప్పెను.

శచీ:—అమ్మ నన్ను చదువుకొనుటకు రానీయ లేదని నేను చిన్న బాబుతో చెప్పెదను.

రాను:—దొడ్డమ్మా! అన్నయ్య చెప్పినమాట నిజమేనా? అట్లయిన చో నేనీ సంగతిని మాఅమ్మతో చెప్పెదను.

పెద్దకోడలు:—వాడికమీద చదువుకొనుటకురాడు. చదువుకొనుట కను వంకయేగాని చదువుస దేమియును లేదు. పిల్లలు నల్గురు కూడి అల్లరి చేయుటకన్న నేమియును లేదు. ఒక్కరి సంపాదనపై ఇంటిఖర్చు జరుగవలసియుండ నీధర్మములు దానములకు డబ్బెక్కడనుండి వచ్చును. బిచ్చగాండ్రను పంపివేయుమని మీనాన్నతో చెప్పుము. స్వయముగ నౌకరీ సంపాదించుకొని ధర్మములు చేయవచ్చును. అంతవరకు బిచ్చగాండ్రను యాచకులను రానీయవలదని చెప్పుము. పొమ్ము.

గోపాలచంద్రుడు భార్యమాటలను విని కొంచెము సిగ్గుపడెను. మరియు భార్యను జూచి "వాడు పసివాడు. వాడీ మాటలనేమి చెప్పగలడు? రామా! మీనాన్నతో మాట్లాడవలయును. నే నొకమారు రమ్మంటి"నని చెప్పుము.

రామచరణుఁడు తండ్రిని పిలువబోయెను. భార్య భర్తను జూచి యిట్లనియెను. చూచితిరా! ఇతరుల సంపాదనపై తనకుటుంబ మంతయు బోషింపబడుటతో తృప్తిచెందక ధర్మముకూడ జేయ దలంచుచున్నాఁడు. పరులసొమ్ము ఖర్చుపడిన చింతయుండునా? తన సొత్తు కాదుకదా!

గోపా:—అదేపనిగా మాట్లాడెదవేఁ? ఊరకుండుము. నేనంతయు సవరించుకొనెదను.

గోవిందచంద్రుడు వచ్చి అన్నా! నన్ను బిలిచితిరా? అని యడిగెను.

గోపా:—వచ్చితివా? కూర్చుండుము. నీవలన నేను మనోవ్యాధికి బాల్పడుచుంటిని. ముందీ యానివారపుధర్మములను నిలిపి వేయుము. నీవు నిరుద్యోగివై యుండుటచే ఖర్చు అంతయు నేనొక్కడను భరించు టెంత కష్టమో యోజించితివా? మిగిలిన సంగతుల నట్లుంచి ముందా యాచకబృందమును పంపివేయుము.

గోవిం:—అన్నయ్యా! నేను మీకష్టము నెరుంగజాలని మూర్ఖుడను గాను. నేను ఆవిషయమే తలపోయుచుంటిని.

గోపా:—ఊరక తలపోసిన లాభములేదు. ఏదియైన త్రోవను జూచుకొనుము. ముందా బిచ్చగాండ్రను పంపివేసి నీ వొకమారిటురమ్ము. నీతో మాట్లాడవలయును.

గోవిం:—ఎంతయో కాలమునుండి నిరీక్షించుచున్న యాదీనుల నూరక పంపివేయుటయా? ఈధర్మ మీనాటిదా? నాన్న గారి కాలమునుండియు జరుగుటలేదా? ఇప్పుడెంతమందియో వచ్చుట మానివేయుటచే సంఖ్య తగ్గినది. అదియునుగాక చాలకాలమునుండి కనిపెట్టుకొనియున్నవారల నిప్పు డూరక

పంపుట ధర్మముకాదు. నీకుతోచినదానినిమ్ము వారలకిచ్చి పంపెదను.

గోపా:—నేనిప్పుడు డబ్బుకొఱకు చాల చిక్కుపడుచుండుటచే నేమియు నీయజాలను.

గోవిం:—ఈమారేదోవిధముగ సర్దుబాటు చేయుము. నేనింకమీద వారలను రావలదని చెప్పెదను. మన మర్యాద దక్కును.

గోపా:—డబ్బులేనప్పుడు మర్యాదల నపేక్షించుట పొరబాటు. నాకా ధర్మములతో నవసరములేదు. నీవు సంపాదించి దానధర్మములజేసి గౌరవమును నిలువబెట్టుకొనుము. నావద్ద నేమియును లేదు. సంసారమును జరుపుటయే దుర్లభమగుచుండ ధర్మములకు డబ్బెచ్చటనుండి వచ్చును? తత్క్షణము మరల రావలదని చెప్పి వారినందరను పంపివేయుము. ఈ దండుగలను నేను భరింపను.

గోవిం:—మన తండ్రిగారున్నప్పుడాదివారమునాడు సుమారు పది రూపాయలు వ్యయమగుచుండెడిది. మనమిప్పుడిచ్చునది దానిలో నాలుగవవంతు లేదు. బీదలకు ధర్మముచేయుట దండుగయా?

సోదరులిద్ద రిట్లు మాట్లాడుకొనుచుండ రామచరణుడు వచ్చి పెద్దబాబూ! బిచ్చగాండ్రు వెడలిపోవుచున్నారు. ఇంకమీద నీ యింటిలో పేదవారికి చెంబుడు మంచినీళ్లైన దొరకవని చెప్పుచు వెడలిపోవుచున్నారు. అని చెప్పెను.

గోపా:—పోవుచున్నారా! మంచిది. పోనిమ్ము. ఇంకమీద వారికి ధర్మము చేయవలదు.

గోవిం:—అన్నా! వారినట్లూరక పంపుట మంచిదికాదు.

గోపా:—కావున్న నీవిచ్చుకొనుము.

గోవిం:—నాదగ్గిర నున్న చో మిమ్మింత కష్టపెట్టుట యేల?

రామ:—పెద్దనాన్నా! మీరు నాకు ఇచ్చిన రెండు కానులు నేను దాచుకొన్నాను. దానిని తెచ్చి యిచ్చెదను.

గోపా:—వెళ్ళు. త్వరగా తీసుకొనివచ్చి బిచ్చగాండ్రకిమ్ము.

రామచరణుడు తల్లికడకు పరువెత్తెను. గోవిందబాబు నిట్టూర్పు విడుచుచు కూర్చుండు గదిలోనికి బోయెను. మఱది వెళ్ళిన వెంటనే పెద్దకోడలు భర్తనుజూచి చూచితిరా! తమ్ముని ధైర్యము? తానిచ్చునది కాని లేదు. మీడబ్బు వ్యయమగుననన్న చింత లేదు. ఎందులకీ జంజాటము. నామాటను విని నేడే స్వస్తి జెప్పుడు.

గోపా:—నేనాసంగతి సంతయు స్థిరపరచెదను. నీవు వంటసంగతిని చూడుము. వేళయైనది. బజారుకు వెళ్ళి రావలసిన పని యున్నదా?

పెద్దకోడ:—మీ మరద లీదినమున వంటపని చూచుకొనును. ఇంకా వితంతువు లున్నారు.

బజారుపని యేమియును లేదు. ఉన్నదానితో పని జరుగును.

ఇక్కడ గోవిందబాబు వీధిలోనికి వచ్చి చూడ బిచ్చగాడ్రందరునుకూర్చుండి కూర్చుండిప్రాణమువిసిగి వెడలిపోయిరి. ఒక్క ముదుసలి కుంటివాడుమాత్రము పడియుండెను. రామచరణుడు లోపలినుండి వచ్చి బాబూ డబ్బు తెచ్చితిని. బిచ్చగాండ్రెచ్చట?

గోవిం:—అదుగో! ఆ పడియున్న కుంటివానికిచ్చి రమ్ము.

చతుర్వర్షవయస్కుడైన యా బాలుడు తన దగ్గిరనున్న రెండుకానులను కుంటివానిచేతిలో బెట్టి దీనిని మీ అమ్మచేతిలో పెట్టుము. దాచును. అని చెప్పగా నా కుంటివాడు ప్రసన్నహృదయుడై దీవించుచు వెడలిపోయెను.

రామచరణుడు కుంటివాడిచ్చిన దీవెనలను వల్లెవేసికొనుచు తండ్రినిజూచి బాబూ! లోనికిరమ్ము. దొడ్డమ్మ యేదో కేకలు వేసినది. అమ్మ మొదులకో యేడ్చుచున్నది. స్వర్ణఅత్తయ్య పెద్ద బాబును బజారువెళ్ళుమని చెప్పినను వెళ్ళలేదు.

గోవిం:—నీవు మీ అమ్మదగ్గరకు పొమ్ము. నేను కొంచెమాగి వచ్చెదను......రామచరణుడు వెడలిపోయెను

గోవిందుడు గదిలోనికి బోయెను. ఇద్దరు ముగ్గురు మిత్రులు చూడవచ్చి కూర్చుండిరి. గోవిందుడు వారితో నిట్లనియె. మిత్రులారా! నేటి పరిస్థితి మారినది. ఏదిరో మార్పు కలుగును. భగవంతు డేమిచేయుచున్నాడో తెలియదు.

అని చెప్పుచుండ శచీంద్రుడు వచ్చి చిన్నబాబూ! నిన్ను నాన్న పిలుచుచున్నాడని చెప్పెను.

గోవిం:—వచ్చుచుంటినని చెప్పుము.

శచీంద్రుడు వెడలిపోయెను. గోవిందుడు మిత్రులంజూచి సోదరులారా! నేను వెళ్ళుచుంటిని. కావలసినది కాకమానదు. నిరాధారుడనై యున్న నాకొఱకై మీరందరును బ్రయత్నించి యొక నౌకరీని స్థిరపరచవలయును. లేకున్న కుటుంబపోషణమున కాధారము లేదు. స్నేహితులాతని మాటలను విని ధైర్యమును బోధించి వెడలిపోయిరి. గోవిందచంద్రుడు గదితలుపులను బిగించి సోదరుని కలుసుకొనబోయెను.

---

## నాలుగవ ప్రకరణము.

—:0:—

# విభాగము.

గోవిందచంద్రుడు మలినవదనముతో వంటయింటిలోనికి బోయెను. ఉదయము పదిగంటలైనది. ఇంతవరకు పొయ్యి రాజ బెట్టలేదు. భోజనపదార్థము లేమియు కానవచ్చుటలేదు ఈమార్పు కారణమేమో తెలిసికొన వలయునని వాంఛకలిగెను. పిలిచిన వెంటనే వెళ్ళనియెడల అన్నగారికి కోపమువచ్చునను భయమున ముం దన్నమైన గోపాలబాబుదగ్గర కేగెను. అన్నగారున్న గదిలోని కేగునప్పటికి గోపాలబాబు భార్యతో మాట్లాడుచు తమ్మునిజూచెను. పెద్దకోడలు మేలిముసుగు సవరించుకొని కొంచెము దూరముగా నిల్చుండెను.

గోవిం:—అన్నా ! నాకొఱకు శచీంద్రుని బంపితివా ?

గోపా:—పంపితిరి. నీతో నొక ముఖ్యవిషయము చెప్పవలసి యున్నది. నీవు నౌకరీ పోగొట్టుకొనిన కారణముచే కుటుంబ భారమంతయు నేను మోయవలసి వచ్చినది. ఇట్టిస్థితిలో నీవు నీభార్యబిడ్డలనేగాక, స్వర్ణమణి, పద్మమణి, గుణదా, కృష్ణవేణి, మొదలగు వితంతువులనుగూడ పోషించుట నాకు చాల దుర్భరముగానున్నది. వారినందరిని పంపివేసినయెడల నాకు చాల వీలుగనుండును. ఒక్కని సంపాదనలో నింత మంది తినవలయునన్న నెట్లు ? కావున నేడు వారినందరిని పిలిచి మీామీా త్రోవలజూచుకొనుడని చెప్పివేయుము. నీవు చెప్పలేకున్న నేనేచెప్పెదను. ఈ పని యీదినముననే జరుగ వలయును. లేకున్న వారముదినములవరకు నాకు కచేరీ

పనితో తీరికయుండదు. కావున నీ విషయమై నీ యభి
ప్రాయ మేమి ?

గోవిం:—నేను నిరుద్యోగి నగుటచే భారమంతయు నీవు వహించిన
సంగతి నే నెరుంగనిది కాదు. నేనుకూడ నౌకరీకొఱకు
ప్రయత్నించుచుంటిని గాని వ్యర్థముగా కూర్చుండలేదు.
దైవకృపవలన కొలదిదినములలో నౌకరీ లభింపవచ్చును.
ఇంతకాలము వహించినవాడవు కొలది దినములు మాత్రము
నిర్వహించినచో నంతయు చక్కబడును. వారిని మన
యింటనుండి పంపుటకు నిన్నను మొన్నను వచ్చినవారా ?
చిరకాలమునుండి స్వర్గస్థులైన మన తండ్రిగారివలన యాశ్ర
యమును పొందియున్న యా వితంతువులను తరిమివేసిన
నెచ్చటికి పోగలరు ? అపకీర్తి ధర్మవిరోధము గాక వేరే
మున్నది ? వారిని వెడలగొట్టినచో నీకేమాత్రము లాభము
కలుగును ?

గోపా:—నీకంత యభిమానమున్నచో వారివందరను నీవు భరిం
పుము. నేనొక్క పైసయైన వారికొఱకు వెచ్చింపజాలను.
ఈ వృథావ్యయము నావలన గానేరదు.

గోవిం:—వృథావ్యయమా ! ఎందులకీ మాటలు ? మనము పెట్టిన
దానికి వారందరు మూడురెట్లు గృహకార్య భారము దీర్చు
చున్నారు. నేటివరకు మనయింటిపనిని జేయుచున్నది వారే
గాని తోడికోడండ్ర కేమియు సంబంధములేదు. మనమీనాడు
వారిని వెడలగొట్టినను వారికెక్కడనో యొకచోట నన్నము
దొరుకకపోదు. భగవంతుడెవరి నాకలితో పరుండబెట్టడు.

నేడువారిని పంపితివేని రేపటినుండి పనికిదాసి. వంటకు వంట మనిషి జెలజీతములిచ్చి పెట్టుకొనవలసి వచ్చును. నీకేమి లాభము కలిగినది ?

గోపా:—లాభనష్టములను లెక్కవేయుటలో చాల సుప్రసిద్ధుడ వైతివి. చాలింపుము. నా లాభనష్టములనుగూర్చి నే నాలోచించుకొనెదను. నీవు వారిని పంపెదవా లేదా ?

గోవిం:—కంఠములో ప్రాణములుండ నే నాపని చేయజాలను. స్వర్గస్థులయిన తండ్రిగారాజ్ఞ కెదురుచేయుటకు నా హృదయ మంగీకరింపదు. నేటి కిరువది సంవత్సరములనుండి తండ్రిగారి వలన మనయింట స్థిరాశ్రయమును పొంది ఇంటి కష్టసుఖ ములయందు పాల్గొనుచు మనలను బిడ్డలవలె చేతులలో నెత్తి పెంచి యావద్గృహ కార్య భారవాహకత్వమును వహించి గృహరక్షకులై యున్న యీ వితంతువులను నేను పంపజాలను. నాకు అన్నమున్న వారికి ఉండును. నాకు లేకున్న వారికిని లేకపోవును.

గోపా:—నీవు వారిని పంపజాలకున్న రేపటినుండి, మనము విభక్తుల మని తలంపుము. నీ కుటుంబము నీ బంధువర్గమును దీసికొని నీవు వేరుగనుండుము. నా వలన నేమియు కానేరదు. నా యింటిలో వారికి స్థానములేదు. నీవు వేరుపడుము. రేపటినుండి నా కుటుంబమునకు నీ కుటుంబమునకు కెట్టి సంబంధ ముండ రాదు.

గోవిం:—అన్నా ! సహోదర వాత్సల్యమును విడనాడి నన్ను వేరు జేయుటకా యీ ప్రయత్నమంతయును దలపెట్టితివి ? నా

మాటను వినుము. దూరము నాలోచింపుము. నే నిదివర కెన్నడును నీ యాజ్ఞ కెదురుపల్కి యుండ లేను. మనమిప్పుడు వేరుపడుటవలన నెవరికిని క్షేమముకలుగదు. సమిష్టికుటుంబ మునగల సౌఖ్యము విభక్తకుటుంబముల కుండదు. కీర్తిశేషు లయిన గౌరవనీయ శ్యామసుందర వంధ్యోపాధ్యాయుని పుత్రులు వేరుపడిరనువార్త లోకమున వ్యాపించుట నాకు సమ్మతముకాదు. కష్టసుఖములను సమానముగ ననుభవించుచు నైకమత్యముకలిగి యేకభాండాశనము జేయుట సర్వదా శ్రేయస్కరము. ఈ దినముకగలకష్టము రేపుండదు. ఖర్చు తగ్గునను తలంపుతో నీవు మమ్ములను వేరుచేయుచుంటివి గాని నీకు వ్యయ మధికమగునుగాని తగ్గదు. నామాట వినుము.

గోపా:—నీవు గొప్ప పండితుడవైతివి నీ యుపన్యాసమంతయు కట్టిపెట్టి రేపటినుండియు నీ కుటుంబపరివార సహితముగ వేరుపడుము. నేటికిమాత్రము మామూలు పద్ధతిని జరుగగలదు. రేపటినుండియు నెవరివంట వారిది.

గోవిం:—నీవు చెప్పునది యదార్థమేనా ?

గోపా:—నిశ్చయము. రేపటినుండి నీ ఖర్చునీది నా ఖర్చు నాది. నే నెన్నిమారులు చెప్పినను నీవు వారినింటినుండి పంపుట కిష్టపడ లేదు. తత్కారణమున విధిలేక వేరుపడవలసి వచ్చినది. రేపటినుండియు మనము విభక్తులము.

గోవిం:— నేను ప్రస్తుతము నిరుద్యోగినై యుండు టెరింగియు నన్నీ తరుణమున వేరుపడుమని నిర్బంధించుటకు నీ యభిప్రాయ మేమో తెలియకున్నది. నేను వేరుపడుటయే నీ కిష్టమైనచో కొలది దినములాగుము. నాకు నౌకరీ లభింపగలదు. వెంటనే

పడిపోయెదను. అంతియేగాని రేపేనన్ను వేరుపఱుమనిన నా కుటుంబ పోషణమునకు వే రాధారమేది ?

గోపా:—కావలసినంత యాధారమున్నది. యేమియు లేకున్న నీవంత ధైర్యముగ మాట్లాడుదువా? భగవంతు డెవ్వరినీ ఆకలితో పరుండబెట్టడని నీ వనలేదా?

గోవిందు డేమియు ప్రత్యుత్తరము చెప్పక నేదియో యోజించుచుండెను. అతని పరధ్యానమును గనిపెట్టి గోపాలబా బిట్లనెను.

గోపా:—నేటి సాయంకాలము నలుగురు పెద్దమనుష్యులయెదుట మనకుగల పిత్రార్జితధనమును పంచుకొందము.

గోవిం:—ఈ మహాకార్యమునకు నల్గురితో నవసరములేదు. నీకు తోచినదానిని నాకిమ్ము. దానితో సంతుష్టినందెదను. గృహ కల్లోలములకు వీధివారి తీర్మానము లక్కరలేదు.

గోపా:—అట్లయిన వినుము. కచేరీసావడికి మధ్య గోడ కట్టించెదను. ఆవలిభాగమును దానికి ప్రక్కనున్న రెండుగదులును నీవు తీసుకొనుము. వెనుక వసారా రెండు భాగములు జేసెదను. దానిలో నీవైపుభాగములో వంటగది నేర్పాటుచేసుకొనుము. ఎవరిభాగము వారికి సంబంధములేకుండ నుండవలయును. లేకున్న నాడువారి పోట్లాట లధికమగును. నావైపునకు సింహద్వారమును వేరుగ బెట్టించెదను. దానితో చిక్కు తీరును.

గోవిం:—నీ ఇష్టమువచ్చినట్లు చేయుము. నీకేమియు నాటంకము లేదు. ఏదో యొక విధముగ సహోదరులను వేరుచేయ వలయునను సంకల్పము వదినెకు చిరకాలమునుండి కలదు. నేటికి నెఱవేఱినది. నాకీ యభిప్రాయము కల్గినచో నింతకాల

మి ట్లూరక కూర్చుందునా? నీవలె నే ముందు జాగ్రత్తకలిగి యుండెడివాడనే.

పెద్దకో:—చాలా బాగుగా నున్నది. పోట్లాటను పెట్టినది నేనేగాని నీవారేమియు నెఱుగరు కాబోలు.

గోవిం:—కోప మెందులకమ్మా! ఇందులో నీ దోషమేమియును లేదు. భిన్నభిన్నప్రదేశముల జనించి దైవసంకల్పమున నొక యింటికి కోడండ్రైనారు. మీ సంబంధము తాత్కాలికముగ సంభవించినది. మే మిద్దరము సోదరులము. ఒక్క తల్లిగర్భమున జన్మించితిమి. ఒక్క రక్తమును పంచుకొంటిమి. అందువలన మా యభిప్రాయములు వేరు నీ యభిప్రాయములు వేరు. దృష్టిలో నీభర్త యొకడే కనపడుచున్నారు. మా దృష్టిలో అందరున్నారు. అదియునుగాక సంపాదనగల భర్త తల్లిదండ్రులు సోదరులతో కలసి యుండుటకు భార్య యంగీకరింపదు. ఇది లోకరివాజు. అందరి కోడండ్రు చేసినట్లే నీవును చేయుచుంటివేమో నాకు తెలియదు. నాల్గుదినములక్రిందట భోజనముమాని నీవు పోట్లాడితివే! ఆనాడు తప్పు దానియందున్నదో లేదో నీకు తెలియదా? తెలిసియే చేయించుచుంటివి. అయినను నాకేల? నే నెన్నడైన గృహకల్లోలములో కల్పించుకొని యుంటినా? సందర్భము వచ్చుటచే చెప్పవలసివచ్చినది.

పెద్దకో:—నీభార్యవలన నేదోషము లేదు. తప్పంతయు నాది. ఇంకమీద నా దోషములను నీవేమియు భరింపనక్కరలేదు. చాలునా! నీ కోపమంతయు తీరినది?

గోవిం:— తప్పవరిదో యింటిలోనున్న వారందరును చెప్పినారు. నా కోపమునకు లక్ష్యమేమి? దరిద్రుని కోపము దౌడలచేటు. చాలుచాలు. ఇంక నీ ప్రసంగము నాపుట మంచిది.

గోపా:— ఈ వృథావాగ్వాదమువలన నేమియు లాభము లేదు. గోవిందా! నే నింతకుముందు నీతో చెప్పినట్లు చేయుట మంచిది. వ్యవహారము ముదిరినపిదప సఖ్యత కలుగదు. పాత్రసామానులోకూడ కొంతభాగము నీకొసంగబడును. ఇంక నేమున్నది? ఈయింటికన్న వేరు రొక్కమేమియు మన తండ్రిగారీయలేదను సంగతిని నీవెఱింగినదే.

గోవిం:— ఏమున్నదో ఏమిలేదో నీకు దెలియవలయును గాని నాకేమి తెలియును? తండ్రిగారు పోయినప్పుడు గల స్థిరచరాస్థిని స్వాధీనముచేసికొనినది నీవుకాని నేనుకాదు. కనుక నాకీసమయమున నీ విచ్చియొసంగినదియే పదివేలు. ఇంతకన్న నేను చెప్పునది లేదు రక్షకుడు దైవమున్నాడు. అని చెప్పి గోవిందచంద్రుడు వెడలిపోయెను.

పెద్దకో:— చూచితిరా? తమ్ముని ధైర్యస్థైర్యములు?

గోపా:— ఈ ధైర్యమెంతకాలమో మనము చూడకపోము.



## అయిదవ ప్రకరణము.

—:0:—

# వితంతువుల కృతజ్ఞత.

మరునాడు గోపాలచంద్రుడు తనకు పరమభృత్యుఁడును యోగ్యుఁడైన తమ్ముని భార్య ప్రోత్సాహమువలన వేరుచేసెను. గోవిందచంద్రుడు వ్యధితహృదయుఁడై చేయునదిలేక కీర్తిశేషులైన తండ్రిగారాశ్రయ మొసంగియున్న దూరపుబంధువులైన యా యరక్షకవితంతువులను భార్యాపుత్రులను వెంటగొని సోదరునితో వేఱుపడెను. వేఱుపడెనే గాని గృహమున నేమున్నది? అన్నగారు వండుకొనుమని యిచ్చిన వంటపాత్రలు గాక ఆహారపదార్థము లేమియును లేవు. అంతయు శూన్యము. గోవిందచంద్రుఁడు తన్నాశ్రయించియున్న వితంతువులను జూచి యిట్లనియె. మీరందరును నాయందు కృపామతులరై నన్నాశ్రయించిన కష్టములలో బాల్గొన దలచి నా వెంట వచ్చియున్నారు. నాయందు మీకుగల యనుగ్రహమున కానందము కలుగుచున్నది. కాని యీ సమయమున నేను నిరాధారుడను. వ్యర్థుడను. మిమ్ము పోషింపగలనో లేనోయని సంశయముగా నున్నది. కావున నన్ను మన్నించి మీరందరు కలిసి అన్నగారికి తగు రీతుల బోధించి యాతని యందనుండుట మీకు శ్రేయస్కరము.

గోవిందుని మాటను విని స్వర్ణమణి యిట్లనియె. గోవింద బాబూ! మీ యన్నగారి ప్రసంగమునంతయు వినియుంటిమి. ఆకలితో పడియుండగలము గాని గోపాలబాబు దగ్గరకు బోవుట మాకు సమ్మతము కాదు.

గోవిం:— నేను రిక్తుడను. ప్రస్తుతము తినుటకేమియు లేనివాడను. మిమ్మెట్లు పోషింపగలను? ఎన్నిదినము లాకలితో నుండ గలరు? ఇక్కడికి పదిగంట లైనది. పిల్లవాడుకూడ నేమియు తినలేదు. అన్నట్లు జ్ఞాపకము వచ్చినది. రామం కానరాలే దేమి? ఎచ్చటనున్నాడు?

గుణదా:— నిద్రపోవుచున్నాడు. వానికీదినమున కొంచెము సుస్తీగా నున్నది.

గోవిం:— నిద్రపోవుటయే మేలు. భగవంతుడే మనయం దనుగ్రహించి వానిని నిద్రపుచ్చినాడు. లేకున్న నేమైన పెట్టుమని యడిగిన నేమిచేయవలయును? ఇంక నాలస్యముచేసిన లాభము లేదు. ఏదియైన నొక వస్తువును తాకట్టుపెట్టియో విక్రయించియో కొంత ద్రవ్యమును సంగ్రహించుకొని వచ్చెదను.

స్వర్ణ:— తాకట్టుపెట్టుట కేమున్నది? చిన్నకోడలి నగలన్నియు నీ తల్లిగారి యంత్యక్రియలకై విక్రయింపబడినవి. మీ అన్న గారు చూచుచు నూరకుండిరి గాని ఒక్క రూపాయకూడ నీకీయలేదు. అంతయు నీవే భరించితివి.

గోవిం:— ఆ దినముల పరిస్థితులు వేరు. ఆయూహ లిప్పుడు పనికిరావు. ఈనాడిట్లు సోదరునిచే బహిష్కరింపబడుదునను సంగతి నె ట్లూహింపగలను. నేటి కిట్టి దరిద్రము-దైన్యము సంభవించు నని తలంచు టెట్లు? అంతయు దైవసంకల్పము. సరియే చాల ప్రొద్దెక్కినది. బజారునకు బోవలయును. ఒక్క మారు దానిని పిలువుము.

స్వర్ణ:— ఎందులకు? ఏదియైన వస్తువుకొఱకా? ఆమెదగ్గిర మిగిలిన

దేమియును లేదు. రెండు గాజులు మెడలోని గొలుసు. పుస్తెలు (మంగళసూత్రములు) గాక నింక నేమున్నది? ఇదిగో నా చేతిని రెం డంగుళీయకములు (ఉంగరము) లున్నవి. వాసిని అమ్మి వచ్చినదానితో పదార్థముల గొని రమ్మి.

గుణ:—వలదు. గోవిందా! స్వర్ణమణి మా యందరిలో చిన్నది. దాని యుంగరములు తీసికొనవలదు. నాదొక హార మున్నది. దానిని దీసికొనిపొమ్ము.

పద్మమణి:—గోవిందా! ఇదిగో నా బంగారపు నానుతాడు. దీనిని గొనిపోయి డబ్బు తెచ్చుకొనుము.

ఈవిధముగ నచ్చటి వితంతువులందరును తమకున్న వస్తువులను గోవిందునిముం దుంచిరి. గోవిందబాబు వారి కృతజ్ఞతలను దలంచి కన్నీరునించి యిట్లనియె. తల్లులారా! మీారందరును నాయందు జూపిన పూర్ణానుగ్రహమున కనేక వందనములు. నే నెంత దరిద్రుడ నైనను ధర్మాత్ములైన శ్యామసుందరబాబువారి కుమారుడను. సాధ్యమగునంతవరకు శక్తివంచన లేక స్వశక్తిపై నాధారపడుటయే కర్తవ్యము. శక్తికి మించిన పరిస్థితి సంభవించి నప్పుడు చూచుకొనవచ్చును.

ఇంతలో రామచరణుడు వచ్చి తండ్రిచేతి కొక హారమునిచ్చి యిట్లనియె. నాన్నా! అమ్మ యీా గొలుసును మీా కీయమని చెప్పినది. ఎవ్వరివస్తువులు తీసికొనవలదనియు దీనిని విక్రయించి ధనమును తీసికొనిరావలయునని చెప్పినది. నాన్నా! అమ్మ యేడ్చుచున్న దేమి? మీారందరిట్లు కూర్చున్నా రేమి?

గోవిం:—తర్వాత చెప్పెదను మీ అమ్మదగ్గరకు పొమ్ము.

రామచరణుడు వెళ్ళిపోయెను. గోవిందుడు మరల నిట్లనియె. మరియొక సంగతిని వినుండు. నేను వెనుక మాతల్లిగారి యుత్తర క్రియలకై దాని నగలనమ్మితిని. కాని శీఘ్రకాలములో దానివి మరల చేయించవలయుననియే నిశ్చయించితిని. ఇప్పటి యాకస్మికపు సంఘటనములవలన వెనుకటివస్తువులు పూర్తిచేయలేక పోగా వున్న యొకటియు నమ్ముకొనవలసి వచ్చినది. ఏమైనను మీ వస్తువులు గ్రహించుటకన్న నాకిదియే మంచిదని హృదయమునకు తోచినది. కావున మీవస్తువులను మీరు గైకొనుడు. మరియు మించివచ్చిన జూచుకొనవచ్చును.

అని చెప్పి గోవిందుడు కాలాతీతమగుచుండుటచే బయలుదేరి వీధిలోనికివచ్చెను. ఎచ్చటికి వెళ్ళుటకును తోచలేదు. ఎవరిదగ్గర దీనిని తాకట్టుంచవలయును? అను సందేహముకలిగెను. ఆలోచించు చుండగా గోపాలచంద్రుడు వీధిలోనికి వచ్చెను. గోవిందుడు చూచి సమీపించి సోదరుని పలుకరించెను.

గోవిం:—అన్నయ్యా కచేరీకి వెళ్ళలేదా?

గోపా:—అనేక కారణములచేత మనస్సునకు స్థిమితములేక వెళ్ళ లేదు. ఇంటిలో నంతయు నేర్పాటైనదా?

గోవిం:—ఏమియును లేదు. ఇంతవరకు వంటసామానులు రాలేదు. నిరుద్యోగినైయున్న తరుణము కనిపెట్టి నన్ను వేరుచేసితివి. ఇప్పుడెట్లు ప్రశ్నించిన నేమిచెప్పగలను?

గోపా:—అట్లనెద వేమి? కృష్ణవేణమ్మ యింతకుముందు తట్టలో భోజనపదార్థము లుంచుకొని యింటిలోనికి బోవుచున్నది. డబ్బు లేకున్న నెట్లువచ్చినవి?

గోవిం:—ఆ సంగతిని నే నెఱుంగను. నేను నిన్ను కలుసుకొని మాట్లాడవలయునని వచ్చుచుంటిని.

గోపా:—ఏమి మాట్లాడవలయును? ఉన్నదంతయు నిన్న నే పంచితిని.

గోవిం:—నిజమే. కాని నావద్ద నిప్పుడొక్క పైస యైనను లేదు. అందుచే సహాయము నడుగవచ్చుచుంటిని.

గోపా:—నీ భార్యయొక్క వస్తువేదియైన తీసికొనివెళ్ళి కుదువ యుంచి డబ్బు తెచ్చుకొనలేకపోయితివా ?

గోవిం:—అందులకే బయలుదేరితిని. కాని ఎవ్వరి నడుగుదును ? నిన్నే యడుగుచుంటిని. కొంచెము దయయుంచి సర్దుబాటు చేయుము.

గోపా:—వస్తువును చూపించుము.

గోవిం:—ఇదిగో గొలుసు. నీ దగ్గరనుంచుకొని నీకు తోచినంత యిమ్ము. కొన్ని దినములవరకు పనిజరుగును.

గొలుసును పరీక్షించిన తదుపరి గోపాలచంద్రునకు సంతోషముకలిగి తమ్మునకేదైన సహాయముజేయుదమా యను తలంపు కలిగెను. గాని యంతలో భార్యయాజ్ఞప్తికి వచ్చునప్పటికా సంకల్పము హృదయమునుండి యంతర్థానమైపోయెను. పెదవి విరిచి యిట్లనియె బంగారము మంచిదికాదు. ఇత్తడివలె నున్నది. దీనికేమి లభింపగలదు? మరియొక చోటికేగుము.

గోవిం:—ఇచ్చుట కిష్టము లేకున్న మానె. ఇత్తడివలె నున్నదని పల్కెదవేల? బంగారము మంచిదియో లేక జబ్బుదో నీకు తెలియదా ?

గోపా:—నాదగ్గిర ప్రస్తుతము నిలువ లేదు. ఇంకొకచోటి కేగుము.

అని పల్కుచు చరచర నడచిపోయెను. గోవిందచంద్రుడా గొలుసును చేతగొని తనమిత్రులందరియిండ్ల కేగెను. అందరును

తలనొకసాకును చెప్పి తప్పించుకొనిరి. గోవిందచంద్రుడు చింతిత హృదయుడై విధిలేక విక్రయించుటకై వర్తకులయింద్లకు బయలు దేరెను. ఈ సమయముననే వెనుకనుండి గోవిందబాబూ! యని కేకవైచిరి. గోవిందుడు వెనుకకు తిరిగిచూచి పిలిచిన వారిని గుర్తించెను.

గోవిం:— శరచ్చంద్రబాబూ! ఎప్పుడు వచ్చితివి ?

శర:— నేటి ఉదయమున వచ్చితిని. అందరును కుశలముగనున్నారా?

గోవిం:— శరీరములు మాత్రమే కుశలములు. మనస్సునకు స్వస్థత లేదు.

శర:— సుమారొక యరగంటక్రింద నిన్ను కలిసికొనవలయునని మీ యింటికి వచ్చితిని. మీ యన్నగారు కనపడి సంగ్రహముగ నింటివృత్తాంతమంతయు జెప్పెను.

గోవిందుడు గొలుసును శరచ్చంద్రబాబుదగ్గర కుదువ యుంచుటకై ప్రస్తావనము జేయుదలంచెను గాని ఇంటిసంగతులన్నియు సోదరుడు తెలియజేసెనని వినినతోడనే యాతలంపు మాని పోయెను. మనస్సునకు విరక్తికలిగి మాట్లాడకుండ ముందునకు సాగి పోవుట కుద్యమించుచుండ శరచ్చంద్రుడాతని ప్రయత్న మెఱింగి చేయిపట్టుకొని గోవిందబాబూ! పోవుచుంటివేమి?

గోవిం:— ఏమియును లేదు. చాల ప్రొద్దెక్కినది. నూతనసంసారమున కన్నియు లోపములే. ఏదియో యొక ఏర్పాటొనరించి దినము జరుగు సదుపాయము చూచుకొనవలయునుగదా ?

శర:— బయలుదేరిన పని పూర్తియైనదా? దొరికినట్లు లేదే?

గోవిం:— సోదరా! నీకీవిషయముకూడ తెలిసినదా?

శర:— గోవిందబాబూ! నాదగ్గర దాపరిక మేలచేయుదువు? ఇంతకు ముందు కృష్ణవేణమ్మ మాయింటికి వచ్చినది.

గోవిం:—నీవామెకేమైన నిచ్చితివా ?

శర:—నాకు తెలియదు. ఇంట్లో ఏమైన నిచ్చినారేమో ?

గోవిం:—ఇంతకుముందు మాయన్నవలన నీ సంగతిని వింటిని. రామచరణుడింత కాలమైనను ఆహారమునకై పోరుపెట్టక పరుండిన కారణమును గ్రహించితిని సోదరా ! యేదో యొకవిధముగ నాయింటి గుట్టంతయు నీకు తెలిసినది. గృహచ్ఛిద్రములు గోప్యముగా నుండవలయును. అట్లు జరుగక వీధిని బడినవి. చెడ్డకాపురమునకు ముప్పేల ? ఈ హారమును కుదువ యుంచుకొని నీకు తోచినంత యిమ్ము.

శర:—ఎన్ని రూపాయిలు కావలయును ? మీ అన్నగారేమనెను ?

గోవిం:— బాగుగానున్నది. యావద్వృత్తాంతము నెరింగియు నన్ను పరీక్షించెదవేల ? మా అన్నగారీహారమును జూచి యిది బంగారముకాదు ఇత్తడిదని చెప్పి వెడలిపోయెను. నేను దీనిని నికరమైన మేలిమి బంగారముతో చేయించితిని. యెంత యిచ్చుటకు దగియుండునో యోచించి నీవేయిమ్ము. ఇంటి వెచ్చములు—కొన్ని సామానులు కొనవలయును. చేతనొక రూపాయకూడ లేదు.

శర:—తాకట్టుపెట్టిన నేమిలాభము? అమ్మివేయరాదా?

గోవిం:—నీయిష్ట మెట్లో యట్లే చేసెదను. ఇతరుల కమ్మనేల? నీవే కొనుము.

శర:—దీనిని చేయించుట కెంత పట్టినది?

గోవిం:— సుమారు నూరురూపాయ లైనది.

శర:—మంచిది. నేనే దీనిని కొనెదను. అరుగుమీద కూర్చుండుము. లోపలికిపోయి డబ్బు తెచ్చి యిచ్చెదను.

ఇర్వురును యింటికి బోయిరి. శరచ్చంద్రుడు గోవిందుని కూర్చుండబెట్టి హారమును తీసికొని లోనికేగెను. వదినిమునములలో

వెలుపలికి వచ్చి పదిరూపాయలనోట్లు పదినోట్లు గోవిందునిచేత బెట్టెను.

గోవిం:—శరద్బాబూ! దీనిని చేయించుటకు పూర్తిగ నూరురూపాయలు కాలేదు. మరియు చాలకాలమైనది. కనుక ఎనుబది రూపాయలు చాలును.

శర:—నీయిష్టము ఎనుబదిరూపాయలే తీసికొనుము.

గోవిం:—ఎనుబది రూపాయలను తీసుకొని యిట్లనియె. మిత్రమా! నేడు నీవొనర్చిన యుపకారమును మరువజాలను. మహా ప్రవాహమున బడి కొట్టుకొనిపోవుచున్న నౌకనైయున్న నన్నుద్ధరింప భగవంతుడు పంపిన కర్ణధారుడవని తోచుచున్నది. సోదరా! రమ్ము. నీయాశ్లేషసౌఖ్యము నొసంగుము. స్నేహితు లిర్వురును పరస్పరాశ్లేషణమున బద్ధులైరి.

శర:—గోవిందబాబూ! సత్వర మింటికిబోయి కర్తవ్యమును నెఱవేర్పుము. నేను సాయంకాలము వచ్చెదను. వీలైనచో మా యాడువాండ్రను పంపెదను. నూతనగృహస్థ ధర్మతత్పరురాలైన నీ భార్యకు కార్యభారమున తోడ్పడగలదు.

గోవిం:—తప్పక పంపుము. అదియును సంతోషించగలదు. నేటి సాయంకాలము మీ కుటుంబమంతయు మాయింటికే భోజనమునకు రావలయును. మరువవలదు.

శర:—ఆ విషయమై నీ వేమియు చెప్పనక్కరలేదు. మీయింట భుజించియే నేనింత యభివృద్ధిలోనికి వచ్చితిని. ఇదంతయు స్వర్గస్థులైన మీతండ్రిగారి యాశీర్వచన ఫలితము. సాయంకాలము వచ్చెదము గాని మాకొఱకై విశేషప్రయత్నము సేయవలదు.

---

ఆఱవ ప్రకరణము.

—:0:—

# క్రొత్తసంసారము.

గోపాలచంద్రుడు తమ్మునితో వేరుపడెను. పెద్దకోడలియొక్క ఆనందమునకు హద్దులేకుండెను. ఇప్పుడు తనయింటికి తానే యజమానురాలు. తానొనర్చు పనులకు హద్దులేదు. ఆటంకము చెప్పువారులేరు. ఇంటికంతయు నేకాధిపత్యము. నిన్నటివరకామెకింటి పనులతో నెంతమాత్రము సంబంధములేదు. అత్తమామలు జీవించి యున్నప్పుడు పెద్దకోడలి యందుండు ప్రేమచే నొక్క పనియైన జేయింపలేదు. ఇప్పుడట్లుకాదు. గృహకార్యమంతయు స్వయముగ జేసికొనవలయును. వంటజేయుటయన నేమోయెరుంగని యామె కీనాడు స్వయముగ పొయ్యి రాజబెట్టుకొనవలసి వచ్చినది. పొయ్యి దగ్గర కూర్చుండి కట్టెలంటించి నిప్పుజేసెను. రెండుమారులు నిప్పు రాజేయుటయు నారిపోవుటయు నైనది. మూడవమారు మరల నిప్పు చేసి కొంచెముసేపు విసినకఱ్ఱతో విసిరినది. పొగవచ్చుట జూచి ఈమారు తప్పక పొయ్యి మండునను విశ్వాసముతో—కొంచెము శ్రమదీర్చుకొనదలంచి కూర్చుండెను. పొగ కన్నులలోనికి బోవుటచే నీరుగారుచుండ తుడుచుకొనుచు నీదినమున నేమిచేయుదునా యని యోజించుచుండెను. ఇంతలో వీధిలోనికిబోయిన గోపాలచంద్రుడు వచ్చి ఇంకను వంటకాలేదా? పిల్లలు గోలపెట్టుచున్నారు.

పెద్దకో:—పొయ్యి ఊది ఊది యిప్పుడే కూర్చుంటిని. పిల్లలు యెక్కడను పోయినారో నాకు తెలియదు. పొయ్యి మంటకు వచ్చినది. ఎసరు పెట్టెదను.

గోపా:—మధ్యాహ్నకాలముదాటినది. ఇప్పుడెనరుప్పిన్ని నెప్పుడు భుజింపవలయును. నిన్నరాత్రినుండి సరియైన భోజనము కుదరక బజారువస్తువులు తినుటచే కడుపు నొప్పివచ్చినది. పిల్లలకుకూడ రోగములు రాగలవు.

పెద్దకో:—యెంతయో ఆలస్యముండదు. ప్రభా! పొయ్యి మండు చున్నదో లేదో చూచిరమ్మా. శచి—ఫూటీ—(కొడుకు చిన్నకమార్తె) ఏరీ ?

గోపా:—అక్కడకు వెళ్ళినారేమో !

పెద్దకో:— నేనెంతయాపినను వీరక్కడకు వెళ్ళుటమానరు. నేనేమి చేయుదును ? అక్కడ భోజనము చేయుచున్నారేమో ! తెలియదు.

గోపా:—అయింట్లో నింకను భోజనమెచ్చట ? గోవిందుడు గంటకు ముందు గొలుసు చేతపట్టుకొని డబ్బుకొరకు తిరుగు చున్నాడు. ఏమియులేనిదే భోజనమెట్లువచ్చును.

ప్రభా:—అమ్మా ! వాళ్ళిద్దరును పిన్నిగారింట్లో నున్నారు. పిన్ని మామయ్యగురకు మూడు మిఠాయి ఉండలు లడ్డూలు పెట్టినది.

పెద్దకో:—ముందు పొయ్యి చూచిరమ్మా.

ప్రభావతి వంటయింటిలోనికి పోయి పొయ్యి చూచివచ్చి తల్లితో నిట్లనియె. అమ్మా ! నీవు పొయ్యి రాజబెట్టితివా ? నిప్పు లేదు. ఎట్లాపెట్టిన కట్టె లట్లేయున్నవి. పొయ్యి మండుటెట్లు ?

పెద్దకో:—నిప్పుచేసి ఊది విసిరితిని. పొగవచ్చుచుండ చూచి వచ్చి నితి. మరల ఆరిపోయినది.

గోపా:— నేను నిప్పు చేసెదను చూడుము. ప్రభా ! కిరసనాయిలు సీసా తీసుకొనిరా.

పెద్దకో:—మీరు నిప్పు చేయుడు. నే నీలోపుగ బియ్యము వగైరా సిద్ధము చేసెదను.

అని చెప్పి గదిలోనికేగి గిన్నెలో బియ్యము పళ్ళెరములో పప్పుకూరలు ఉంచుకొని వచ్చి కత్తిపీటముందు కూర్చుండెను. బంగాళాదుంపలను తరుగుచు చేయి కోసుకొనెను. వెంటనే లేచి చేతినెత్తురును కడుగుకొని దానిపై తడిగుడ్డ కట్టెను. గోపాల చంద్రుడు విశ్వప్రయత్నముచేసి నిప్పును తయారుచేసి భార్యను సమీపించి చేతివ్రేలునుచూచి చేయి కోసుకొంటివా యని యడిగెను.

పెద్దకో:—కూరతరుగుచు పొఱపాటున చేయి కోసుకొంటిని. ప్రభా! నీవుపోయి తమ్ముని చెల్లెలిని పిలుచుకొనిరమ్మ. వారికి బుద్ధి చెప్పెదను.

గోపా:— ఇక్కడకు రెండుగంటలు కావచ్చినది. ఆహారము లేదు. ఇన్ని అటుకులు పెరుగు అరటిపండైన దెప్పింపుము. తిని కడుపు నింపుకొనెదను. పెనిమిటి మాటను విని భార్య పెరుగు అటుకులు తీసుకొనిరాబోయెను.

ప్రభావతి ఎనిమిదేండ్ల బాలిక. తల్లియాజ్ఞపై గోవిందుని యింటికి బోయి చూడ తమ్ముడు చెల్లెలుకూడ పినతండ్రిప్రక్కను గూర్చుండి భుజించుచుండిరి. ప్రభావతి కేకవైచి శచీంద్రా! పూటీ! అమ్మ వద్దనుచుండ మీరిచ్చట కూర్చున్నారు. ఇంటికి రండు. నాన్నగారిచేత దెబ్బ లున్నవి.

గోవిం:—ప్రభా! వాళ్ళ పిన్ని బలవంతముచేసి రానీయలేదని మీ అమ్మతో చెప్పుము. నీవు భోజనము చేసితివా?

ప్రభా:—చేయలేదు. ఇంతకుముందే నాన్న పొయ్యి రాజపెట్టినాడు. ఇంకను వంటయే లేదు. భోజనమెట్లు?

గోవిం:—బాగుగనే యున్నది. కూర్చుండుము. నీవుకూడ భుజించి పొమ్ము.

స్వర్ణమణి:—క్రొత్తకాపురము ముచ్చటగా నున్నది. ఇంతవరకు తిండిలేదు. వేళకు సిద్ధముచేసి పెట్టుచుండ కూర్చుండి తినలేక

వేరుపడినందులకు ఫలితము ఏమనగా పిల్లలకు వేళ కన్నము లేకపోయినది.

గోవిం:—ఇది సమయము కాదు. ఊరకుండుము. ప్రభా! రమ్ము. ప్రభావతికి తల్లి వలదని యెంతబోధించినను చిన్నపిల్లయగుట చేతను ఆకలిబాధవలనను పినతండ్రిదగ్గర చనువుచేతను మెత్తపడెను. అందరు భుజించుచుండ నా బాలికకు నోరూరుటచే కడుపునిండ భుజించి తమ్ముని చెల్లెలిని వెంట బెట్టుకొని తల్లిదగ్గరకు బోయెను. తల్లి కుమార్తెను జూచి కోపించి ప్రభా! నీవుకూడ నింతసేపేమి చేయుచుంటివి? మి మ్మందరిని నేడు లంకణ ముంచెదను.

ప్రభా:—మాకు నీవు పెట్టనక్కర లేదు. మేము ముగ్గురము పిన్నమ్మగారింట్లో కడుపునిండ భుజించి వచ్చితిమి.

పెద్దకో:—ఇంకను వంటయే లేదు భోజనము లైనవా?

శచీం:—బంగాళాదుంపలకూర పిన్ని బాగుగా వండినది. మాకు రేపు ఉదయమువరకు భోజన మక్కర లేదు.

గోపా:—సరియే వెళ్ళి ఆడుకొనుడు. గోవిందు డేదియో చమత్కారము చేసినాడు.

పెద్దకో:—అతనిదగ్గిర ధనమున్నది. మీ రమాయకులుగనుక నతని కల్ల బొల్లిమాటలనువిని మోసపోవుచున్నారు. రెండుగంటల క్రింద బయలుదేరిన మీతమ్మునకు డబ్బెక్కడ దొరికినది ? ఎప్పుడు పదార్థములు తెచ్చినాడు ? ఇంటిలో వంట యెట్లు జరిగినది ? అంతయు మోసము. రహస్యముగ ధనమును సంగ్రహించుకొని దాచియున్నాడు.

గోపా:—గొలుసులు తాకట్టుపెట్టుటకై బయలుదేరినప్పుడు వానితో మాట్లాడితిని. నాకు వానియందేమియు కపటమున్నట్లు కన్పడలేదు ఇదేమిరహస్యమో తెలియలేదు. ఇంతకు నేదియో యొక పథకముగ రెండిట భోజనములైనవి. వారందరు తిని మనపిల్లలకును పెట్టినారు నేటి పరిస్థితులుజూడ నీ దినము భోజనమునచ్చు నగుపాయము లేనట్లున్నది. పద్దు పాలు త్రాగి నేను కాలక్షేపము చేయవచ్చును. రేపటి గతియేమి?

పెద్దకో—శచీంద్రుని—ప్రభావతిని బంపి మాయమ్మను బిలిపించెద, ఒక నెల రెండునెలలుండి యిల్లు చక్కబెట్టి తనయింటికి పోవును. ఈలోపుగ నేనుకూడ మాయమ్మదగ్గిర వంట జేయుట నభ్యాసము జేసెదను.

గోపా:—అది మంచి యాలోచనము. వీలైనచో పిల్లలతో నేను కూడ వెళ్ళి పిలుచుకొని వచ్చెదను.

పెద్దకో:—మీరుకూడ వెళ్ళినచో మరియు మంచిది. దంపతులిట్లు మాట్లాడుకొనుచుండ రామచరణుడు వచ్చి పెత్తండ్రితో నిట్లనియె పెద్దనాన్నా! నీవును దొడ్డమ్మయు భోజనము చేయలేదని నాన్నగారు భోజనమును పంపినారు. అమ్మ తీసుకొనివచ్చినది. అని చెప్పెను.

పెద్దకో:—మేము ముందు భోజనముచేసితిమి సుమాయని పరిహసింప నక్కరలేదు. మా యింటను భోజనములైనవి తీసుకొని వెళ్ళవచ్చును.

గోపా:—ఊరకుండుము నాకేమియు నభ్యంతరములేదు. రామా అక్కడపెట్టి వెళ్ళుమని మీ అమ్మతో చెప్పుము. కొంచెము సేపుండి భుజించెదను. యింకమీదట నీవిధముగ తీసికొని రావలదని చెప్పుము.

చిన్నకోడలు తీసికొనివచ్చిన వంటపదార్థము నచ్చుటనుంచి పిల్లవానితో వెడలిపోయెను. స్వర్ణమణి, పద్మమణి మొదలగువారితో తోడికోడలన్న మాటలను చెప్పెను. భార్యమాటలనువిని గోవిందు డిట్లనియె. నేను నా కర్తవ్యమును నెఱవేర్చితిని. సోదరుడింకను భుజింపలేదు. భుజింపకున్న శరీరారోగ్యము చెడునని అన్నమును పంపితిని. వదినెకింత కోపమువచ్చునని నేనెట్లూహింపగలను ?

స్వర్ణ:—నీవు వారిద్దరిని నీవారిగా భావించితివి. వారిద్దరు నిన్ను వేరుగ దలంచినారు. కాకున్న బంగరుగొలుసును జూచి యిత్తడియని యెట్లు పలుకును ?

గోవిం:—పోనిమ్ము. అపసంగమును కట్టిపెట్టుము ఇంతమాత్రమున మనకేమియు నవమానములేదు. రాత్రి శరచ్చంద్రుడు సకుటుంబముగ మనయింటికి భోజనమునకు వచ్చును. తగు రీతిగ పదార్థములను సిద్ధముచేయుము.

స్వర్ణ:—అతనికి మనముచేయు విందులేమియును లేవు. నీతో మాట్లాడుటకు ముందే రెండుదినములకు సరిపడు పదార్థములను పనివానిచేతికిచ్చి భార్యను వెంటబంపియున్నాడు. అతనిసొమ్మె అతనికి పెట్టవలయును. ఆమెయు మంచి తెలివి తేటలుకలది. ఇంటికి వచ్చియురాకముందే గృహమందలి సమస్తపదార్థములును పాత్రిసామానును యథాస్థానముల నేర్పాటుచేసి చక్కగ నలంకరించినది.

గోవిం:—తెలిసినది. శరచ్చంద్రబాబు తనభార్యనెందులకు బంపెనో మనయింటికి భోజనమునకు వచ్చుటకేల యంగీకరించెనో యాకారణమును గ్రహించితిని.

స్వర్ణ:—కష్టసమయమున నీ కతడు తోడ్పడెను. కావున నీవును తరుణము వచ్చినప్పుడు ప్రత్యుపకార మొనర్పవలెను.

గోవిం:—అక్కా! స్వర్ణమణీ! భగవంతుడు మనకట్టి యవకాశ మును కలుగజేయునా?

స్వర్ణ:—అట్టితరుణము తప్పక రాగలదు. ప్రపంచకమున ధర్మమునకు జయము తప్పదు. కావున నీవాధర్మమును వదలకుము.

---

ఏ డ వ ప్రి క ర ణ ము.

—:o:—

# స్నేహితురాండ్రు.

"చెలీ!

"సఖ!

"ఇంక పోయివచ్చెదను.

"అప్పుడే వెళ్ళవలయునుకాబోలు. ఒక్కనిముసము మాట్లాడకున్న నిలువజాలకుంటివా?

"చాల రాత్రియైనది ఇంటికిపోవలదా?

"నీవెవ్వరికొరకు తొందరపడుచుంటివో వారిచ్చట నేయుండ తొందరపడెదవేల?

"ఇంటిలో దీపములు సరిగా పెట్టినారో లేదో—పనివాండ్రు న్నారో లేదో—సత్వరమిల్లు జేరవలదా?

"మరల నెప్పుడు వచ్చెదవు?

"అదృష్టమున్నప్పుడు.

"వచ్చినదిమొదలు కూర్చుండ లేదు. మాయిల్లంతయు సర్దు చుంటివి. అప్పుడే పోవుచుంటివి. ఇంతకు మాయదృష్టవశమున మీరు రాగల్గితిరి. లేకున్న మాయవస్థ యెట్లుండెడిదో.

"పరమేశ్వరానుగ్రహమువలన మేమిచ్చుటకు బదులీయగుట తటస్థించినది.

"కనుక నే నీవంటి స్నేహితురాలిని సంపాదించుకొన గల్గితిని.

"ఇంతకు నన్ను వదలిపెట్టెదవా లేదా ?

"వెళ్ళదలచినదానవు వలదన్న మానుదువా ? ఇదిగో నీ హారమును తీసికొనుము.

"వలదు. నీకీయవలసినదిగా నాకాజ్ఞయైనది.

"చెలీ ! నామాటవినుము. దానిని మీవారు కొనినారు. దాని స్వత్వముమీది. ఈ గొలుసును నామెడలో చూచిన వారేమనుకొందురో యెరుంగుదువా ?

"అక్కా ! నేనొక్కటి చెప్పెదను వినుము. నేనస్వతంత్రను. వారియాజ్ఞల బాలించుట నావిధి. మీవారు కోపింతురను భయమక్కరలేదు. అడిగినయెడల నాదగ్గిర కొన్నట్లు చెప్పుము.

"నేను నీకేమిచ్చితిని ? విలువను తీసికొననిచో దానినమ్ముటయెట్లగును ?

"విలువను గ్రహించితిని. నీ స్నేహధనమును నేనుతీసుకొని దానికిబదులుగ నీ హారమిచ్చితిని. నీ సందేహము తీరినదా ?

"చెలీ ! ఈ హతభాగిని దుఃఖిని యొక్క స్నేహమున కిది ప్రతిఫలమా ? నాదినములు తలక్రిందగుటచే నీవు దీనిని నాకీయ గల్గితివి. నేను దీని ప్రతిఫలమును నీకీయ జాలకపోయితిని. క్షమింపుము.

"తప్పు. అట్లనవలదు నీ వదృష్టవంతురాలవు. నీహృదయము పవిత్రము. నీస్నేహమిట్టి తుచ్ఛహారములకంటె వేయిరెట్లు ఘనమైనది. క్షణభంగురములగు—బుద్బుదప్రాయములగు భాగ్యములకై చింతింపకుము. నీతోడికోడలు బావగారుచేసిన యధర్మములను వింటిని.

భగవత్పదకమలము. పైనదైవమున్నాడు. న్యాయాన్యాయవిచారణమును సల్పుచుండును.

"ప్రాణసఖీ ! ఇంకొకజన్మమున నేను నీకేమగుదును ?

రాబోవు జన్మలోని వృత్తాంతమును నేను చెప్పజాలను గాని ఈ జన్మములో నిప్పటికి మనమిర్వురము స్నేహితురాండ్రము. నీకు నెలలు నిండుచున్నవి. ఈశ్వరేచ్ఛవలన కుమార్తియే పుట్టినయెడల మా నారాయణునకు పెండ్లిచేయుము. మనమిద్దర మప్పుడు వియ్యపురాండ్రమగుదుము సరియేనా ? నీయభిప్రాయమేమి ?

పై సంభాషణమునుబట్టి వారిర్వురును గోవిందచంద్ర—శరచ్చంద్రుల భార్యలని పాఠకులు గ్రహించియే యుందురు. వారిర్వరట్లు మాట్లాడుకొనుచుండ గోవిందచంద్రుడు—శరచ్చంద్రుని చేయిపట్టుకొని లోనికివచ్చెను. స్వర్ణమణి భోజనపదార్థములను పాకముచేసి సిద్ధముగ నుంచెను యిర్వురును స్నానములను జేసి శుభ్రవస్త్రధారులై భోజనములను పూర్తిగావించిరి. శరచ్చంద్రుడు తాంబూలమును వేసికొనుచు గోవిందునిచూచి యిట్లనియె. గోవింద బాబూ! నా కొరకింత ప్రయత్నమేల చేయవలయును ? నేను పరుడనా? జ్ఞాపకములేదా ? మరచితివి కాబోలు. చిన్నతనమునుండి మీయింటభుజించి చదువుకొంటిని. ఈనాటికి పోలీసు సర్కిలు ఇనస్పెక్టరునై యిటకు వచ్చితిని. నేను జనసాధారణమునకు పోలీసుఅధికారినిగ ని మీయెదుటమాత్రము చిన్ననాటి దీనశరచ్చంద్రుడనే. నేటి నీ యాదరణమునుజూచి నవ్వువచ్చుచున్నది. కాదుకాదు. లజ్జ కలుగుచున్నది. బాల్యమున చదువుకొను దినములలో మీ తండ్రిగారిని బలవంతపరచి పాఠశాలజీతము కట్టుబట్టలు మొదలగునవి తెచ్చియిచ్చి సోదరునివలె జూచితివి. నాటివృత్తాంతము మరచుటెట్లు ?

గోవిం:—అదిచాల స్వల్పవిషయము. ప్రయోజకులై ధార్మికులైన తండ్రిగారికా కార్యము చాలసులభము. కాని నేను నీవలన నేను పొందిన మహోపకారము జన్మమధ్యమున మరువదగి నదికాదు.

శర:—సరియే. ఆ విషయమును వదలుము ఈ రెండుగదులు ఈ చిన్న సావడిలో మీరంద రెట్లుండగలరు ?

గోవిం:—ఏదియోయొక విధముగ కాలక్షేపము జేయవలయును. వెనుకవసారాలో వంట భోజనములు జరుగును. ఆ చిన్న గదిలో సామాను పెట్టుకొని—స్త్రీ లందరా పెద్దగదిలో పరుందురు. నేను సావడిలో పరుందును.

శర:—ఇంతచిన్నయింటిలో మీరు నివసించుట కష్టము. పద్మమణిని కృష్ణవేణిని—సోదరి గుణదా—వీరు ముగ్గురను నామాట విని నావెంటబంపుము. నారాయణుని తల్లికి (శరచ్చంద్రుని భార్య) చాల సహాయముగా నుండును. స్వర్ణమణియొక్కతె మీయింట నున్నచాలు.

గోవిం:—నాకేమియు నభ్యంతరము లేదు. వా రిష్టపడినచో తీసుకొని వెళ్ళుము. నాయింటికిని నీయింటికిని భేద మేమున్నది ?

శరచ్చంద్రుడు వారిని ముగ్గురిని జూచి తల్లులారా! మీకు గోవిందు డెట్టివాడో నేను నట్టివాడనే. కొన్ని దినములు నాయందనుగ్రహించి నాయింటికి వచ్చినచో పిల్లవాని తల్లికి చాల సాయము కలుగును. మీకెప్పుడు వలయునన్న నప్పుడు మీగోవిందుడున్నాడు వెళ్ళవచ్చును.

శరచ్చంద్రుని వాక్యముల కా వితంతువులు ముగ్గురు సంతసించిరి. శరచ్చంద్రుడు గృహోన్ముఖుడై బయలుదేరెను. శరచ్చం

దుని భార్య మేలిముసుగు సవరించుకొని పిల్లవాని నెత్తుకొని బయలుదేరుచు చిన్నకోడలిని జూచి చెలీ! వెళ్ళివచ్చెదను.

చిన్నకోడలు:— మంచిది. అప్పుడప్పుడు వచ్చుచుండుము.

ఇంతలో పద్మమణి వచ్చి శరచ్చంద్రుని పుత్రుడగు నారాయణు నెత్తుకొనెను.

శర:— గోవిందా! పోయివచ్చెదను.

గోవిం:— శుభమగుగాక! మరల కలసికొనగలను.

అటుపిమ్మట ముందు శరచ్చంద్రుడు, తరువాత భార్య, వెనుక పిల్లవాని నెత్తుకొని పద్మమణి మిగిలిన యిర్వురు వితంతువులును బయలుదేరిరి.



## ఎనిమిదవ ప్రకరణము.



# క్షేమాసుందరి.

గోపాలచంద్రుడు భార్య చెప్పినట్లు తన యత్తగారిని తీసికొని వచ్చెను. ఆమె పేరు క్షేమాసుందరి. క్షేమాసుందరి మొదట నిరాకరించెను. ఎన్నియో యాటంకములను జెప్పివచ్చుటకు వీలుకాదనెను. కాని యల్లుని బలవంత మధికమగుటచేతను కుమార్తె గృహానిర్వాహకత్వమున నసమర్థురాలగుటచేతను రాక తప్పినది కాదు. వచ్చిన నాటి రాత్రి పదురెండు గంటలవరకు శ్రమపడి క్షేమాసుందరి యిల్లంతయు సవరించి ఏయే సామాను లెచ్చట నుండవలయునో వాని నచ్చోట భద్రపరచి పరుండెను. మరునాడుదయమున లేచి సత్వరముగ పనులను దీర్చి యల్లుని కచేరీవేళకు వంట

జేసి సిద్ధముగ నుంచెను. గోపాలచంద్రుడు వేగముగ భుజించి సకాలమునకు కచేరీకి వెళ్ళెను. త్రోవలో కొంతమంది పురుషులు స్త్రీలును గోపాలచంద్రుడు ముందు పోవుచుండ వెనుకనుండి అదిగో. చూడుడు. గోపాలబాబు కచేరీకి వెళ్ళుచున్నాడు. తమ్ముని మరదలను ఇంటనున్న ముదుసలి వితంతువులను వేరుజేసి యత్తగారిని పిలిచి యింటి యజమానురాలిని గావించినాడు. అని వారిలో వారు చెప్పుకొనసాగిరి. గోపాలచంద్రుడు డా మాటలనువిని తన తమ్ముడే యిల్లిల్లు తిరిగి యీ విధమున దుర్బోధ మొనర్చియుండునని నిశ్చయించి తిరిగి యింటికివచ్చినపిదప పిలిచి తగురీతిని దండింపవలయు నని నిశ్చయించెను

గోపాలబాబు వెళ్ళుటయే తడవుగ యిరుగుపొరుగు పుణ్య స్త్రీ లొక్కరొక్కరుగ వచ్చి క్షేమాసుందరిని జూచి అమ్మా! వచ్చితివా? కుమార్తె వేరింటి కాపురమును చక్కబెట్టవచ్చితివి కాబోలు! మంచిదే. ఇక్కడమాత్ర మెవరున్నారు? ఉన్నవా రెవరో దూరముగ తొలగింపబడిరి. ఇంక నాటంక మేమున్నది? ఇంతకు మీ అమ్మాయి చాల అదృష్టవంతురాలు.

అని యీ విధముగ క్షేమాసుందరి వీధిగుమ్మములోనికి వచ్చుటయే తడవుగ వ్యంగ్యవచనముల బల్కుచుండుటచే నామె యెంతయు లజ్జితయై లోనికేగి కుమార్తెను బిలిచి కూర్చుండబెట్టి యిట్లనియె. మోహినీ! నీవలన నాకు తలవంపులు కలుగుచున్నవి. నన్నవమానించుటకా పిలిపించితివి? వీధిలోనివా రందరును నీవు బలవంతముగ వారి నందరిని వేరుచేసితివని చెప్పుచున్నారు. నీకంత తొందర యేలవచ్చినది? ఏపనియైన నిదానించి యోచించి చేయ వలయును.

మోహి:—వీధిలోనివారి మాటలతో లెక్కయేమి? నోటికి వచ్చినట్లు మాట్లాడుదురు.

క్షేమా:—కుమారీ! నీకు లోకజ్ఞానము లేదు. "పదుగు రాడుమాట పాటియై ధరజెల్లు" అనురీతిని లోకమర్యాదను గుర్తెరింగి సంచరింపవలయును. పదిమంది యేమాట మాట్లాడిన నదియే లోకమున యదార్థమగును. నామాటను వినుము. నీ యిల్లు దిద్దుటకును వంటజేయుటకు నొక బ్రాహ్మణ స్త్రీని మాట్లాడుకొనుము. నా దారిని నేనుపోయెదను.

మోహి:—అట్లనే చేయవచ్చును యిప్పుడంత తొందరేల ?

క్షేమా:—ఇంకొక సంగతి. నీవు స్వర్ణమణిని పద్మమణిని వేరుచేయుట చాల పొఱబాటు. ఇంటిలో పెద్దవారుండుటెంత మంచిదో నీకేమి తెలియును.

మోహి:—వారిమాటను నాతో చెప్పవలదు. పోయినారో! నా ప్రాణము సుఖపడినదేమో ?

క్షేమాసుందరి లాభము లేదని గ్రహించి యా ప్రసంగము నాపి కొంచెముకాలము విశ్రమించి మధ్యాహ్నము దాటిన వెంటనే గోవిందచంద్రుని యింటిలోని కేగెను. గోవిందునిభార్య—స్వర్ణమణి—యామెను గౌరవించి యుచితాసనమున గూర్చుండబెట్టిరి. తనకచ్చోట నింతగౌరవము లభించునని క్షేమాసుందరి తలంపలేదు. కొంచెము కుశలవార్తలు జరిగినపిమ్మట క్షేమాసుందరి ప్రసంగము లకు మొదలుపెట్టెను.

క్షేమా:—మీారందరును పెద్దవారు. మా మోహినిని కొంచెము మందలించిన బాగుండెడిది.

స్వర్ణ:—మా పేరన్న నామె క్షేమము లేనప్పుడు మేమెట్లు చెప్ప గలము ? చెప్పిన లాభమేమి ?

క్షేమా:—చిన్నతనముగుటచే నొకవేళ తిరస్కరించినను మీరు పెద్దవారగుటచే చెప్పవలసిన బాధ్యతగలదు. మీరు గోవింద చంద్రుడెట్టివాడో మా గోపాలచంద్రుడు నట్టివాడే. ఇర్వురు సమానులు.

స్వర్ణ:—ఇర్వురును సమానులే కాని గోవిందుడు పాడ్యమినాటి చంద్రుడు గోపాలబాబు పూర్ణిమనాటి చంద్రుడు.

క్షేమా:—మీ మాట నాకర్థముకా లేదు.

స్వర్ణ:—మరల చెప్పుచుంటిని వినుము గోవిందుడు పాడ్యమినాటి చంద్రుడు. క్రమక్రమముగ వృద్ధికి రావలసినవాడు. గోపాల బాబు పూర్ణిమనాటి చంద్రుడు. పూర్ణిమనాటి చంద్రుడు షోడశకళాపరిపూర్ణుడు అట్లే యతడు సర్వవిధముల పూర్ణుడై అభివృద్ధికి వచ్చియున్నాడు. మీదయవలన నొకానొకప్పుడు గోవిందుడుకూడ పూర్ణిమనాటి చంద్రుడు కావలయును.

క్షేమా:— మీ యభిప్రాయము గ్రహించితిని. గోపాలబాబు పూర్ణిమ చంద్రుడు గనుక క్రమ క్రమముగ క్షీణగతికి వచ్చును. స్వర్ణమణీ ! పెద్దదానవగు నీకీ పక్షపాతవృత్తి యేల? గోవిందునిపై యభిమానముండుగాక గోపాలబాబును శపించుట నీకు తగదు. మీ చిత్తవృత్తులు తెలిసినవి. ఇంక మీ యింటికి రాకూడదు. నేను పోవుచుంటిని.

క్షేమసుందరి కుపితయై వెడలిపోయెను. ఆమె వెడలి పోయిన తరుపరి చిన్నకోడ లిట్లనియె. స్వర్ణవదినా ! మీరామె యెదుట నట్లు మాట్లాడుట మంచిదికాదు. బావగారు వచ్చిన వెంటనే ఒకటికి నాలుగు కల్పించి కలహము పెంచును.

స్వర్ణ:—మనమింక వారివలన భయపడవలసిన యవసరములేదు. నీ వామెసంగతి నెరుంగవు. మనయొక్క సంగతిని కనిపెట్ట వచ్చినది. మనమేమి తినుచుంటిమో—ఏమి మాట్లాడు చుంటిమో—యెరుంగనట్లు చూడవచ్చినది.

చిన్నకో:—నాకీ గొడవ యేమియును తెలియదు. శాంతికి భంగము కలుగకుండ—జగడములు—కలహములు లేకుండ కాలము జరుగుటయే నాకు కావలయును.

---

తొమ్మిదవ ప్రకరణము.

—:0:—

## అర్ధాంగి.

ఆకస్మికముగ మహా ప్రవాహమునబడిన వహానవుడు దరిజేరుట కేదైన సాధనము దొరుకునా యని యెట్లు వెదకుకొనునో అట్లే గోవిందచంద్రుడొక్క మారుగ సంసార సాగరమున బడుటచే దార పుత్రపరిరక్షణమున కాధారమేమా యని చింతింపనారంభించెను. గోవిందుని హృదయమున పెక్కుచింతలు తరంగములవలె ముందు నకు దుముకుచుండెను. తనకింత చిన్నతనమున వివాహము కాని యెడల భార్యయొక్క విచారపూరిత వదనమును జూడవలసిన దురవస్థ లేకపోవునుగదా యని తలంచెను.

గోవిందచంద్రు డీవిధముగ సావడిలో గూర్చుండి తలపోయు చుండ భార్యవచ్చి కట్టెదుట నిలువబడెను. ధర్మపత్నిని జూచి కమలా! ఇటువచ్చితివేమి ? ఇంటనెవ్వరును లేరా ? సోదరి స్వర్ణ మణి యెచ్చటకు పోయినది ? తక్కినవారు—

కమ:—స్వర్ణవదిన రామచంద్రుని దీసికొని యాడించబోయినది మిగిలినవా రందరును స్నేహితురాలి యింటికేగి యుందురు.

గోవిం:—ఈ క్రొత్తస్నేహితు రాలెవ్వరు ?

కమ:—శరచ్చంద్రబాబుగారిభార్య నన్ను తన ప్రాణస్నేహితు రాలిగా జేసికొనెను.

గోవిం:—మెడలో నేదియో మెఱయుచున్నది. తెలుసుకొనవచ్చునా?

కమ:—హారము మీరా నాడు కుదువయుంచుటకై తీసికొనిపోయిన హారము. స్నేహితురాలు నాకమ్మినది.

గోవిం:—కొనుటకు నీ దగ్గిర డబ్బెక్కడ ?

కమ:—డబ్బుతో నవసరము లేకుండగనే కొంటిని. స్నేహధనము నకు విక్రయించినది. నేను వలదని పెక్కుసారులు చెప్పి హారము నీయబోవ వలదని నానోరు మూసినది. భర్తయాజ్ఞయైనదనియు వారియానుమతి మీదనే నీకీ విధమున నొసంగు చుంటినని చెప్పినది.

గోవిం:—అడుగుటయే తడవుగ హారమును కొనిన కారణము తెలిసినది. కాని యాతడొనర్చిన యీ మహోపకారమును, జ్ఞప్తి లోనుంచుకొనుము.

కమ:—ఆ విషయమును మీరింతగా చెప్పనక్కరలేదు. చేసిన మేలును మరచినవారికి సద్గతులుండవని చెప్పుదురు.

గోవిం:—కమలా! నేనొక్క మాటను చెప్పెదను. సావధానముగ నాలకింపుము. ఈవిధముగ నెన్నిదినములు గడుపగలము. ఉన్నంతవరకు మార్చుకొని తినినచో తరువాత దినములు జరుగు విధానమెట్లు? కావున నీవు కొంతకాలము పిల్లవానిని దీసికొని మీ పుట్టినయింటికిబొమ్ము. నేనచ్చటనైన నుద్యోగమును కుదుర్చుకొనిన పిదప నిన్ను పిలుచుకొని వచ్చెదను.

నీవిచ్చట మిగుల కష్టదశ ననుభవించుచుంటివి. ఎంతకాల
మని చూచుచు నూరకుండగలను ?

కమ:—నా కష్టములకు జూడజాలక నన్ను పుట్టినయింటికి బొమ్మను
చుంటిరి. కాని మీ కష్టములనుగూర్చిన తలంపు మీ కెంత
మాత్రమును లేదు. నాకేమి బాల్యమునుండియు కష్టములతో
పెరిగిన దాననగుటచే నాకు విచారము లేదు. చిన్నప్పుడే
తల్లి చనిపోయినది పేదరికమున పెక్కుదుఃఖములన్నట్లు—
ఒక పూటతిని తినకయు కాలము జరిపితిని. మీరు చిన్ననో
బాల్యమున తల్లిదండ్రులయొక్క వాత్సల్యమున గారాబ
మున పెరిగి కష్టమనున దెరుంగక సర్వదా సంతోషముతో
జీవితమును గడపిన మీకీనాడు సంభవించిన మనోవ్యాధిని
జూడ నా హృదయము తల్లడిల్లుచున్నది నాతండ్రిగారిప్పుడు
మంచిస్థితిలో నున్నను, మీ మాటనువిని నే నటకు బోజా
లను. పోయినను నాకు సంతోషముండదు. ఎంతకష్టమైనను
సహించి మీపాదసేవ చేయుచు మీకు వలయు నుపచారము
లల్పుచు సంతుష్టి నందెదను. మీచరణదాసి నీ భాగ్యము
నుండి తొలగింపవలదని నా ప్రార్థనము.

గోవిం:—నీ మనస్సునకు కష్టముగలుగు మాటలనిక నచింపను.
కాని ఈ హతభాగ్యుని చెట్టబట్టక మరియొకరిని పరిణయ
మాడినయెడల నీకీదుర్భర దారిద్ర్య సంతాపముండకపోవును.

కమ:—నాథా! అట్లనవలదు. నన్ను నిందించిన నంగీకరింతును గాని
మిమ్ము నిందించుకొనిన వినజాలను. నిర్భాగ్యురాలను—మర
దృష్టవంతురాలనగు నన్ను పరిణయమాడుట వలన నే బంగా
రమువంటి మీ సంసారము భిన్నమైనది.

గోవిందుడు విచారమును పట్టజాలక ప్రేమనిధియగు భార్య
నక్కున జేర్చుకొని కంఠాశ్లేషసుఖ మనుభవించుచు నిట్లనియె.

అర్ధాంగీ! నీవే నాజీవిత నాటకమునకు సూత్రధారిణివి. నాహృదయ శాంతి కాధారమవు. నీవంటి పతి పరాయణులైన రమణీమణుల సాంగత్యమువలన బాల్యవివాహ సూత్రబంధితులైన గృహస్థులు చిత్తశాంతిని సంతోషమును ననుభవించుచున్నారు

కమ:—చాలు చాలు. ఇంక నీప్రసంగము నాపివేయుము. ఉద్యోగ ప్రయత్నము లెంతవరకు ఫలించినవి ?

గోవిం:—ఏదియైన నుద్యోగము లభించునేమో యని కొండంత ప్రయత్నము చేయుచుంటిని కలిసిరాలేదు ఇంతయును కర్మ ఫల మనుకూలముగ లేదు. మానవజీవితమునందలి సుఖదుఃఖములన్నియు వాని వాని కర్మానుసారములై యుండును. జీవుని సృష్టిస్థితిలయములన్నియు కర్మ ననుసరించి యుండును. దానినే ప్రారబ్ధమందురు. మనదినములు మంచివి కానప్పుడు దుఃఖమే కాని సుఖమెప్పటను లభింపదు.

కమ:—పూర్వము కుంతీమహాదేవి శ్రీకృష్ణ భగవానుని జూచి నారాయణా! నాజీవితమంతయు దుఃఖమయమగునట్లు వర మడిగెనని మీరొకనూరు నాతో చెప్పియున్నారు. అట్లనే మానవుడు తరించవలయుననిన దుఃఖమువలన తరించవలయును. దుఃఖములు కలుగుచున్న యెడల ఈశ్వరభక్తి దిన దినాభివృద్ధి చెందును. భగవంతుడు ఆర్తత్రాణ పరాయణు డనిగదా! పెద్దలందురు.

గోవిం:—నిశ్చలభక్తితో శ్రీమన్నారాయణమూర్తిని ధ్యానింపుము. మనకష్టము దీర్పగలడు. ఇంకొక సంగతి. ఆఫీసునకు మేనేజింగు డైరక్టరు వచ్చినాడని విన్నాను. మా తండ్రిగారికిని ఆయనకును మిక్కిలి స్నేహము. ఒక అర్జీ వ్రాసి పంపించెదను. మన యదృష్టము మంచిదైనచో నా మహానుభావుడేదైన త్రోవజూపగలడు.

కమ:—అట్లు చేయుము. ఆయనచాల మంచివాడనియు—రామ గారితో సోదరభావమున నుండువారని వినియున్నాను. ప్రయత్న మూరకపోదు.

గోవిం:—ఈ విషయమై శరచ్చంద్రునితో ఆలోచించి పనిచేసెదను.

---

పదియవ ప్రకరణము.

—:o:—

# గోపాలచంద్రుని కపటము.

గోపాలచంద్రుడు కచేరీలో గూర్చుండెనే గాని యతని చిత్తము గృహమందు లగ్నమై యుండెను. ఇంటివద్దర భార్యాపిల్లలు ఏమి చేయుచున్నారో యను చింతతో పరధ్యానముగ నుండెను. ఇంగ్లాండునుండి ఆఫీసుయొక్క మేనేజింగు డైరక్టరు వచ్చుటచే కచేరీయంతయు గందరగోళముగా నున్నది. గుమాస్తాలందరు తమ తమ విధులలో తత్పరులైయుండిరి. మేనేజింగు డైరక్టరుగారు ధర్మ బుద్ధి కలవాడగుటచే జీతమును వృద్ధిచేయించుకొన దలచినవారు కొందరును ఉన్న పదవికన్న పైపదవికి పోదలంచినవారు కొందరును ఆత్మబంధువుల కుద్యోగము నిమిత్తమై చెప్పుకొన దలచినవారు కొందరును డైరక్టరుగారి దయాపూర్వకాహ్వానమునకై వేచియుండిరి. గోపాలచంద్రునకు మాత్ర మెట్టివాంఛయును లేదు. డైరక్టరుగారు లండనునుండి వచ్చి కచేరీలో కాలుపెట్టిననా డాఫీసులోని గుమాస్తా లందరు వచ్చిరి కాని గోపాలచంద్రుడే హాజరుకాలేదు. ఆ దినమున నతడు తమ్మునితో విభక్తుడై వంటకము చేయుటలో మగ్నుడై

యుండుటచే ఆఫీసునకు రాజాలకపోయెను. గోపాలచంద్రు డెక్కడ యని డైరక్టరు అడిగెను. రాలేదని మిగిలినవారు చెప్పిరి. తదుపరి గోవిందచంద్రుని గూర్చి విచారింప గోపాలచంద్రుడు సోదరుని యుద్యోగమునుండి తప్పించెనని తెలిసినది. గోవిందుని యుద్యోగము నుండి తప్పించెన సవార్తను విని దయార్ద్రహృదయుడైన డైరక్టరు చాల చింతించెను. కారణమేమనగా మిత్రుడును విశ్వాసపాత్రుడు నగు స్వర్గస్థుడైన శ్యామసుందరుని కోరకపై సోదరుల కిరువురకును తన చేతిమీదుగ నుద్యోగ మొసంగుటచే గోవిందుడు తొలగింప బడుటకెంతయు వగచెను.

మరునాడు గోపాలబాబు కచేరీకి వచ్చి యావద్వృత్తాంత మును తెలుసుకొనెను. సోదరుని యుద్యోగమును తానే తీసివేయిం చిన సంగతిని డైరక్టరు తెలిసికొనెనని విని డైరక్టరుకు దర్శనము చేయుటకు సాహసింపలేను. రహస్యము బహిర్గతమైనచో తన యుద్యోగమున కెక్కడ భంగము కలుగునో యని యతడా వైపు నకు బోలేదు. ఆఫీసు మేనేజరు సాయమున నతడీ కార్యము నొనర్చి యుండుటచే తన కాపద రాకుండ కాపాడు భారము మేనేజరు దని నిశ్చయించి యతనిని సంతుష్టజేయుటలో నిమగ్నుడయ్యెను.

గోవిందు డుద్యోగమునుండ తప్పింపబడుటకు కారణ మేమ నగా? గోపాలచంద్రు డొకమారు గొప్ప పొరపాటు చేసెను. అందు వలన నొకవ్యవహారములో చాలనష్టమువచ్చెను. తత్సంబంధములైన కాగితములను లెక్కలనుసరిజూచి యీ ప్రమాద మెవరివలనకలిగెనో తెలిసికొనవలసిన బాధ్యత ఆఫీసు మేనేజరు శిరముననున్నది. ఆఫీసు మేనేజరగు ధామ్సన్ తెలిసియో తెలియకయో విమర్శింపక వదలివే యుటచే నావ్యవహారము ఆఫీసుదాటి డైరక్టర్ల చేతులోబడి వెంటనే విమర్శనమునకు వచ్చెను. ధామ్సన్ తనమీదకువచ్చిన తప్పును దిద్దు

కొనుటకై తన క్రింది యుద్యోగియైన గోపాలచంద్రునిపై బెట్టెను. గోపాలచంద్రుని డైరక్టరు (సంజాయిషీ) సమాధానము చెప్పుమని యడుగగా నతడు నిజమంగీకరించిన తన యుద్యోగము పోవునను భయముచే యా నేరమంతయు తన తమ్మునిపైకి ద్రోసెను. చివరకీ యపరాధమునకు గోవిందుడు సమాధానము చెప్పవలసి వచ్చెను. గోవిందుడనేకవిధముల యోజించెను. నిజమును చెప్పినచో సోదరున కుద్యోగభంగము కలుగును. సమిష్టికుటుంబములో పెద్దజీతగాడగు సోదరున కుద్యోగముపోయిన చాలనష్టము, అపకీర్తివచ్చునని తలంచి సోదరీభక్తుడగు గోవిందచంద్రుడన్నగారు చేసిన నేరమును తనపై బెట్టుకొనెను. గోవిందుని యుద్యోగము పోవుటకు కారణ మిదియే. ఆఫీసులోని తదితర కర్మచారు లందరిసంగతి నెఱుంగుదురు. కాని గోవిందుని బలవంతమున వారి రహస్యమును బైలుపెట్టలేదు. ఇప్పుడు ధర్మాత్ముడైన మేనేజింగు డైరెక్టరు మరే వచ్చియుండుటచే తదితర కర్మచారులందరును గోవిందుని ప్రస్తుతావస్థ నెఱింగినవారగుటచే అర్జిని పంపుకొనుమని బలవంతపరచిరి. శరచ్చంద్రుడు కూడ ప్రార్థనా పత్రమును బంపుమని గట్టిగ నొక్కి చెప్పుటచే గోవిందచంద్రుడు తనకష్టస్థితిని వెలుబుచ్చుచు నేదియైన నుద్యోగము నిప్పింపుడని ప్రార్థనాపత్రమును బంపుకొనెను.

మేనేజింగు డైరక్టరు మరే వేరొక నూతనవ్యాపారమును ప్రారంభించు తలంపుతో విదేశమునుండి వచ్చెను. వచ్చిన మూడు దినములవరకు కచేరీలోని వ్యవహారములను సరిజూచుకొనుటకే సరిపోయెను. నాలుగవనాడు సావధానముగ తన గదిలో కూర్చుండి గోపాలచంద్రునకు వార్తనంపెను. గోపాలబాబు వచ్చి డైరక్టరున కభివాదమొనర్చి కూర్చుండెను. కొంతకాలము ఆఫీసు వ్యవహారమునుగూర్చి మాట్లాడుకొనిరి.

మరే:—గోపాలబాబూ! మీ తమ్ముని సంగతి యెట్లున్నది? మేము ప్రారంభింపబోవు నూతన వ్యాపారములో నతని కొక వుద్యోగము సేయదలంచితిని. అతఁ డిప్పు డాఫీసునుండి తొలగింపబడి నిరుద్యోగియై యుండెనని వింటిని. అతని నొక్కమారు నా దగ్గరకు తీసుకొనిరమ్ము.

గోపాలబాబునకు మనమున భీతియు నయిష్టము కలిగెను.

గోపా:—చిత్తము. మా తమ్ముఁ డిప్పుడు చాల ధనికుఁడయ్యెను. వుద్యోగమును చేయుట కంగీకరింపఁడని నా యభిప్రాయము.

మరే:—ఎట్లు ధనికుఁడయ్యెను?

గోపా:—నౌకరీనుండి తొలగిన తరువాత గోపించుడొక వ్యాపారమును ప్రారంభించెను. దానిలో నతనికి మంచి లాభము కలిగెను. అతఁడిప్పుడు చాల నుచ్ఛదశయం దున్నాఁడు. ధనమునకెట్టి లోపము నులేదు.

మరే:—చాల సంతోషము. అతని యుచ్ఛదశను గూర్చి భగవంతు నకు నమస్కరించు చున్నాను. ఇంకొక యోగ్యత గలవానిని వెదకి తీసుకొనిరమ్ము.

గోపా:—చిత్తము. అట్లనే తీసుకొనివచ్చెదను.

ఈ విధముగ వారిద్వరు మాట్లాడుకొనుచుండ బంటొత్తు జాబు నొకదానిని గొనివచ్చి గోపాలబాబు చేతికిచ్చెను. దానిని చదువుకొనిన వెంటనే గోపాలచంద్రుని ముఖకాంతి మారెను. ఒక్క నిట్టూర్పు విడిచెను.

మరే:—గోపాలబాబూ! ఉత్తరమునందలి వృత్తాంత మేమి?

గోపా:—మా అత్తగారికి కలరా తగిలెననియు శోచనీయమగు దురవస్థలోనున్నదని వార్తవచ్చినది. దయయుంచి సెలవొసంగిన పోయివచ్చెదను.

మ. రే:—తక్షణము పోయిరమ్ము.

అనుజ్ఞగైకొని గోపాలబాబు గృహోన్ముఖుడయ్యెను. పిమ్మట మరే తన్ను కలుసుకొనవచ్చిన నౌకరిద్దరితో మాట్లాడి తనయాఫీసు గదిలోనికిబోయి కుర్చీలో కూర్చుండెను కన్నెదుటనున్న బల్లపై నొక కవరుండుటజూచి మరే దానిని చించి లోని కాగితమును జూడ నదియొక ప్రార్థనాపత్రము. దానిని గోవిందచంద్రుడు పంపుకొనియుండెను. మరే దాని నాద్యంతము చదివి యాశ్చర్యయుక్తుడై యిట్లు తలపోసెను. ఇది చాల విచిత్రముగా నున్నది. నిజముగా గోవిందచంద్రుడింత దీనస్థితిలో నుండెనా! ఇంతకుముందు గోపాలబాబు చెప్పినదానికిని అర్జీలో వ్రాయబడిన దానికి నెంతమాత్రము సంబంధము లేదే. ఇం దేదియో రహస్యమున్నది తెలుసుకొన వలయును.

అని తలంచి బంట్రోతునుపిలిచి గోపాలబాబును పిలువుమని పంపెను. బంట్రోతు రెండు నిముసములలో తిరిగివచ్చి బాబుగా రింటికి వెళ్ళినారని చెప్పెను. మరే కాగితముపై యొకజాబు వ్రాసి దీనిని గోపాలబాబుగారి తమ్ముడగు గోవిందబాబుగారికి వెంటనేబంపి పిలిపింపవలయునని చెప్పి యాజాబు వానిచేతి కిచ్చెను.

వెంటనే గోవిందునికొఱకు వర్తమానము పంపబడెను.

## పదకొండవ ప్రకరణము

—:0:—

# "భిషగ్రత్న ప్యారీలాల్"

సోనాపూరు గ్రామములో చిరకాలమునుండి తగిన వైద్యులెవరును లేరు. ఎవరికైనా రోగమువచ్చినయెడల వైద్యునికొఱకు మూడు నాలుగు క్రోసులదూరము పోవుచుండువారు. యిటీవల "భిషగ్రత్న ప్యారీలాల్" అనునొక మహాశయుడు కొన్నిమందులను వైద్యగ్రంథములను దీసికొనివచ్చి సోనాపూరులో నొక తాటాకు గుడిశలో వైద్యశాల నేర్పాటుచేసి రోగులకు చికిత్సచేయ నారంభించెను. అతడొక విలక్షణ పురుషుడు. దూరపు బాదుగురాలైన మేనత్తయొకతె తప్ప నతని కుటుంబమున నెవరును లేరు. రెండు పెండ్లిండ్లు చేసికొనెను. ప్రథమ భార్య పోయిన కొలది కాలమునకే ద్వితీయ వివాహము జేసుకొనెను. కాని యిట్టి మహాపురుషునితో కాపురముచేయలేకయో—పితృదేవతలను కొంతకాలము పున్నామ నరకమునందుంచదలంచియో యామెయును భూలోకమును వదలి స్వర్గధామము నలంకరించెను.

మరల తృతీయవివాహము జేసికొనవలయునను తలంపు కలదు. మేనత్త యొక కన్యను స్థిరపరచెను. కాని గ్రామములోని పెద్దలు కొంతమంది వలదని మందలించుటచే యీ ప్రయత్నమును మానుకొనెను. ఉదయమున లేచి కాలకృత్యముల దీర్చుకొని నల్లమందుమోతాదు తగిలించి రోగులనిమిత్తమై వైద్యశాలలో గూర్చుండును. ఎవరైన వచ్చినచో వారి శరీరస్థితిరోగము సంగతి యటుంచి ముందు తన వివాహమునుగూర్చి ప్రసంగించుచుండును. చతురులగువారు వానితో కొన్ని యిచ్ఛకపుమాటలను జెప్పి తమ

పనిని గడుపుకొని పోవుచుండును. రోగులకు చికిత్సజేయు కాల మంతయు తన వివాహప్రసంగములతో బూర్తిజేయును. జ్వరాది రోగములచే పీడితులగు వారికి మందులిచ్చుచు ని ట్లుపన్యసించు చుండును. సోదరులారా! మీరంద రంగీకరించినచో నేను మరల వివాహము జేసికొనెదను. వివాహము పితృదేవతలను తరింపజేయు సాధనము. పెండ్లిజేసుకొని భార్యవలన సంతానమును బడసిన గాని పితృదేవతలకు శాశ్వత పిండప్రదానము సంభవింపదు. చనిపోయిన పితృదేవతలను తృప్తిజేయుట పురుష లక్షణము. ఎట్లయినను ప్రయత్నించి మీరందరును నా వివాహకార్యమును పూర్తిచేయవలయును.

ప్యారీలాలు మాటలను విని యటనున్నవా రందరును లోలోపల నవ్వుకొనుచుందురు. వారిలో నొక డిట్లనియె. మహాశయా! తాము తప్పక వివాహితులు కావలయును. ఏదియో యొక మార్గమున సంతానలాభమును గాంచవలయును

మరియొకడు:—యదార్థము. ధర్మపత్ని - ధర్మసంతానము కలిగి నప్పుడే పితృదేవతల పిండప్రదానధర్మము నెఱవేరును. అయినను మీవయస్సెంత? మధ్యవయస్సేకదా! తల కొంత భాగము నెఱసినంతమాత్రమునను రెండుమూడు దంతము లూడి పోవుటచేతనే ముసలివా రగుదురా? నేను కన్యను విచారించెదను.

అందమైన పెండ్లికూతురు మీకు తగిన వధువును నిర్ణయించెదను వివాహమాడుడు. తదుపరి మీకు సంతానప్రాప్తియు పితరులకు పిండప్రదానప్రాప్తియు నెట్లు కలుగకుండునో చూచెదను.

ప్యారీ:—నాయనా! ఆ పని చేసినను నీకు పుణ్యముండును. నీకు మంచి మందిచ్చి నీ రోగమంతయు కుదిర్చెదను. ఇదిగో

శ్రద్ధగా వినుము. పిల్ల అందముగా నుండవలయును. త్వరలో అక్కరకు రావలయును.

మూడవవాడు:— వెంటనే సంతానప్రాప్తి కావలయును. పితృదేవతల పిండప్రదాన వాంఛాపరిసమాప్తి కావలయును. ఈవిధముగ గ్రామస్థుల ధర్మమా యని వైద్యమహాశయుల సంతానమును వంశాభివృద్ధిని జూచి మనసుందర మానందింపవలయును. ఇదేగదా మీ కోఱిక.

ప్యారీ:— అంతే. పితౄణము దీర్చి పురుషుడు తరింపవలయును. ఇంతకన్న నా కేవాంఛయు లేదు.

ఈవిధముగ వచ్చినవా రందరును డాక్టరుగారితో సరసల్లాపము జేయుచు లోలోన నవ్వుకొనుచుండిరి. ఇంతలో గోపాలచంద్రుఁడు రొజుకొనుచు వచ్చి వైద్యమహాశయ! సత్వరముగ రావలయును. రోగిణియొక్క స్థితి మారిపోవుచున్నది. రండు. అని తొందరించెను.

ప్యారీ:— నిన్న నేనిచ్చిన మాత్రను వేసినారా?

గోపా:— నిన్నటిసంగతి నాకు తెలియదు. నేను కచేరీనుండి వచ్చునప్పటికి చాలకాలమయ్యెను. నేటి ఉదయము మీరిచ్చిన మాత్రను వేసితిని. కాని-రోగమధికమైన సూచనలే కన్పట్టుచున్నవి. ఇంకొకరిని పిలుచుకొని రావలయునా?

ప్యారీ:— వలదు. ఆపని చేయవలదు. పడినకష్టమంతయు గంగలో కలియును. నేనే వచ్చెదను.

ప్రక్కనుకూర్చున్న రోగులనుజూచి సోదరులారా! నేనిప్పుడే వచ్చి మీ కందరకును మందులిచ్చెదను. కొంచెము కాలము వేచియుండుడని చెప్పి గోపాలచంద్రునితో వెడలిపోయెను. ఇంటికిపోవునప్పటికి డాక్టరుగారి వెనుకటి మాత్రల ప్రభా

వమువనో ప్రపంచకమున నుండవలసిన కాలమైపోవుట చేతనో క్షేమాసుందరి స్వర్గము నలంకరించెను. ప్యారీలాలు విషయమును తెలుసుకొని మెల్లగ తనయింటిత్రోవ పట్టెను. అత్తగారి మరణమునకు గోపాలబా బెంతయు చింతిల్లెను. కుమార్తియైన మోహిని (గోపాలబాబు భార్య) యొక్క దుఃఖము చెప్ప నలవికాదు.

---

## పన్నెండవ ప్రకరణము.

—:0:—

# అదృష్టఫలము.

గోపాలబాబు సెలవుదీసుకొని వెడలిపోవుటయే తడవుగ మరే గోవిందబాబునకు టెలిగ్రాం పంపిన వార్తను కచేరీలోని వారందరును విని యాశ్చర్యపడుచుండిరి.

ఒకడు:—మిత్రులారా! జరిగిన సంగతి యంతయు డైరక్టరుగారికి తెలిసినది. గోవిందబాబుగారిని పిలిపించి యదార్థమును తెలిసికొందురు.

ఇంకొకడు:—గోపాలచంద్రుని సంగతియు మేనేజరుగారి సంగతియు నున్నది.

ఆఫీసులోని వారందరీ విషయమును గూర్చి చెప్పుకొనుచుండిరి. మేనేజరు ఖామ్సనువచ్చి గోపాలబాబు యెచ్చటనని యడిగెను. గుమాస్తాలందరు జరిగిన వృత్తాంతమును చెప్పిరి.

థామ్సనుకు మనమున భయముకలిగెను. గోవిందచంద్రుఁడు కచేరికివచ్చి డైరక్టరును జూచినమొదల రహస్యము బయల్పడును. కావున తాను ముందుగ మరేను, కలుసుకొని గోవిందునకు నౌకరీ లేకుండ జేయవలయునని నిశ్చయించి మేనేజింగు డైరక్టరుగారి ఆఫీసుగదిలోని కేగెను. కొంచెము కాలము కంపెనీకి సంబంధించిన వ్యవహారములను గురించి సంభాషణము జరిగెను. తదుపరి థామ్సను వచ్చిన విషయమును గురించి సంభాషణమునకు మొదలుపెట్టెను.

థామ్స:—గోవిందబాబును రమ్మని తంతివార్తను బంపినారా?

మరే:—పంపితిని వచ్చినాడా ?

థామ్స:—రాలేదు. అతడేదియో వ్యాపారమువలన ధనమును సంపాదించెనని వింటిని. మీరుపంపినవార్తను జూచి వచ్చునా! రాడా ! అని నా యనుమానము.

మరే:—తప్పక రాగలడు ? అతడు ధనికుడైనట్లు నీ వెట్లెరింగితివి ?

థామ్స:—సోదరుడైన గోపాలచంద్రునివలన విన్నాను.

మరే:—నాన్సెన్సు. (Nonsense.) అంతయు అబద్ధము. నిన్న నేను గోపాలబాబునుపిలిచి గోవిందున కుద్యోగమిచ్చు విషయమున ప్రశ్నింప నిట్లే ప్రత్యుత్తరమిచ్చెను. గోవిందుడిప్పుడు చేతనొక రూప్యమైన లేక కుటుంబపోషణమునకు బాధపడుచున్నాడు. రేపు కచేరికి వచ్చినవెంటనే పిలిపించి నాతో నసత్యమాడినందులకు దండించెదను.

థామ్స:—గోపాలబాబు చెప్పిన దసత్యమని తామెట్లూహించితిరి?

మరే:—అంతయు నబద్ధము. గోవిందచంద్రుఁడు తనకష్టమునంతయు ప్రకటించుచు తనకేదియైన నుద్యోగ మిప్పింపుమని (దరఖాస్తు) ప్రార్థనాపత్రమును పంపెను. అతని సంగతిని నే నెఱుంగుదును. అబద్ధమనుమాట గోవిందునికడ లేదు. అర్జీ

యంతయు చదువగనే నాకు జాలివేసినది. నీవలన నతడు పదభ్రష్టుడైనను నీ విషయమై అర్జీలో నెంత కృతజ్ఞతను కనపరచెనో చూడుము. మేనేజరుగారు కారణాంతరములచే నన్నుద్యోగమునుండి తప్పించు టవసరమగుటచే యట్లొనర్చిరి. కాని వారికి నాయందు వాత్సల్యమే. అని వ్రాసి యున్నాడు. కృతజ్ఞతను గనుపరుచుటలో నతడు తనతండ్రిని మించుచున్నాడు.

అనిచెప్పి గోవిందుడు పంపిన ప్రార్థనాపత్రికను ధామ్సను చేతికిచ్చెను. అతడాద్యంతము చదువుకొనెను. తనచే వెడలగొట్ట బడిన గోవిందుడు తనకు వ్యతిరేకముగా నేమియు వ్రాయకపోవుటచే నతనికి ధైర్యముకలిగెను. మరియు డైరెక్టరునకు గోవిందునయం దధిక వాత్సల్య ముండుటవలన వ్యతిరేకముగ తానేమి చెప్పినను ఫలితములేదని తెలిసికొని ధామ్సను తనయభిప్రాయమును మార్చుకొనెను.

ధామ్స:—అట్లయినచో సోదరుల కిర్వురకును వెనుకటి యనురాగము తగ్గియుండును.

మరే:—నాకును అదియే తోచుచున్నది. సోదరులలో ప్రేమతగ్గిన గాని యిట్టి విరోధభావము లేర్పడవు. అదియునుగాక కచేరీలో గోపాలచంద్రుని మనస్సు క్రమముగ లేదు. పనిచేయునప్పుడు ప్రమాదములు చాలవచ్చుచున్నవి. వీరి తండ్రి శ్యామసుందరబాబుగారివలన మన కంపెనీకి చాల లాభము కలిగినది. ఆయన మనకంపెనీకి చేసిన పరిశ్రమకు ప్రతిఫలముగ నతని యనంతరము కుమారుల కిర్వురకు నౌకరీ యిప్పించితిని.

ధామ్స:—ఆసంగతియంతయు నాకుదెలియును. గోపాలబాబు కచేరీకి వచ్చినవెంటనే పిలిపించి గట్టిగ మందలించినచో సరియైన త్రోవకువచ్చును.

రే:—గోవిందునిగూడ ప్రశ్నించి పిమ్మట యదార్థమును తెలిసి కొనెద. తదుపరి గోపాలచంద్రుని విషయము నాలోచించెదను.

సేవకుఁడు వచ్చి చేతికొక కాగితమునిచ్చెను. మరే చదువుని. మ్మక ! ఇదిగో ! గోవిందబాబు వచ్చినాడు. సేవకా ! బుగారిని లోనికిఁబంపుము.

మ్స:—మీరాతనితో కర్తవ్య నిర్ధారణము జేయుఁడు. నాకు గొంచెము పనియున్నది పోయివచ్చెదను.

అనుజ్ఞగైకొని థామ్సను వెడలిపోయెను. గోవిందచంద్రుడు నికివచ్చి మరే అభివాద మొనర్చెను. జీర్ణ వస్త్రాచ్ఛాదిత దేహుఁడైయున్న యాతని వేషమునుగూడ మరేకు చాల విచారము లిగెను.

మరే:—గోవిందబాబూ ! కూర్చుండుము. నీ యీమలినవేషమును జూచి చాల చింతిల్లుచున్నాను. నీకీ దురవస్థ యెట్లు వచ్చినది ?

గోపాలచంద్రుడు పోవునప్పుడు వేరువరచునపుడు తమ్ముని విలువగల బట్టలనుగూడ సంగ్రహించి పాతబట్టలతో సాగనంపెను. అయినను భ్రాతృభక్తుఁడైన గోవిందుఁడందుల కేమియును జింతపడలేదు.

గోవిం:—నను ఆఫీసులోనుండి తొలగింపబడినది మొదలు నాకీ దురవస్థ ప్రారంభమైనది.

మరే:—నీవొక వ్యాపారముచేసి యందువలన చాల ధనార్జన మొనర్చితివని వింటిని. నిశ్చయమా ?

గోవిందుడు నిర్విణ్ణుడయ్యెను. కొంచెముకాల మూరకుండి యిట్లనియె.

గోవిం:—చాల ఆశ్చర్యకరమైనట్టియు నా విషయమున విచారకరమైన యీ సంగతిని చెప్పినవారెవరు ?

మ. రే:—మీ అన్నగారు. సెలవుదీసికొని యింటికి వెళ్ళినాడు. లేకున్న
పిలిపించియుందును.

గోవిందునకెంతయో దుఃఖమువచ్చెను. తన్ను గురించి సోదరుడనిన మాటలు కర్ణములకు శరాఘాతములవలె తగిలెను. నిరాధారుడగు తన్ను వేరుచేసి పితృయమైన ఆస్తిలో మూడువంతులకు పైగా సంగ్రహించినది చాలక పిడికెడన్నమునకై పరితపించు తన ప్రయత్నముల భగ్నముచేయదలంచి కొండెములు బల్కిన యన్నగారి దుర్బుద్ధికెంతయు వగచెను. అధికారితో నతడేమి పల్కుటకును తోచలేదు. మరే గోవిందుని మౌనముంగాంచి యిట్లనియె. గోవింద బాబూ! మాట్లాడవేమి? నేనొక యుద్యోగమును నీకిచ్చు విషయమై మీ అన్నగారితో ప్రసంగింప నతడిట్లు చెప్పెను. నీ యిప్పటి పరిస్థితిని గమనింప విషమసమయమునని నన్ను మోసపరచి నీవు నీకుటుంబము క్షుద్బాధచే పీడితమగుచుండ తాను సుఖపడ దలచినాడు.

అతడు నీ విషయమై యొనర్చిన యన్యాయమునకును-నీవిట్టి కష్టమున మునిగియుండ నాకు జెప్పకపోవుటయేగాక నీ విషయమై యసత్యవార్తను సృష్టించినందులకు దండనముగ నతనిని పదభ్రష్టుని జేసెదను.

గోవిందుడు విషమసంకటమున జిక్కుకొనెను. తనకష్టమును జెప్పి సోదరున కుద్యోగభంగము కలుగును. కుశాగ్రబుద్ధియైన మరే తన యావద్వృత్తాంతమును కొంచె మించుమించుగా సంగ్రహించి యుండుటచే తానడుగ నేమిచెప్పినను లాభములేదు. ఇతని మనస్సులో రెండు విషయములు తాండవించుచుండెను.

స్వప్రయోజనమా! లేక సోదరుని దండనమా! ఎంత యోచించినను చిత్తమునకు స్థిరత్వము కలుగలేదు. కొలదికాలములో చింతించుచు తలను వంచుకొని యుండెను. తుదకిట్లు తలం

చెను. ఒక్క విదేశీయుని సంబంధములేని భిన్న జాతీయుని భిన్న ధర్మావలంబకుని యనుగ్రహమునకై సోదరునికి నష్టము కలిగించుట మన యార్యసంతానమునకు ధర్మముకాదు. కేవల మపకీర్తిహేతువు. సోదరుని యుద్యోగమును తీయించినవాడని లోకులు నిందింతురు. కావున యూరకుండుట సర్వశ్రేయమని తలంచి తలవంచుకొని యూరకుండెను.

మరే:—గోవిందబాబూ! నీవు నామాటకు ప్రత్యుత్తరమును చెప్పక మిన్నకుండుటకుఁ దగిన హేతువును గ్రహించితిని. నీ సోదరుని లోపమును బయలుపెట్టుటకు నీ వెంతమాత్ర మంగీకరింపవు. బాతృభక్తి నీయందు మూర్తీభవించినట్లున్నది. ఇందువలన నీ హృదయములోని గొప్పతనము వెల్లడియైనది. నిన్ను నేను క్రొత్తగ నిర్మించబోవు వర్తక కార్యస్థానమునకు మేనేజరుగా ఏర్పాటుచేసితిని. జీతము నీ సోదరునకిచ్చినట్లు నెలకు రెండువందల రూపాయల నిచ్చెదను. శ్రద్ధగ పనిచేయుచుంటివేని నీ యభివృద్ధికింకను తోడ్పడెదను.

కూలిపాలిచేసి కుటుంబమును పోషింపదలంచిన గోవిందుని చెవులకు మరే చెప్పిన మాటలు వినబడి కన్నులనుండి నీరువచ్చెను. పితృమిత్రుడై పితృతుల్యుడైన మరే తనయందు చూపిన యనుగ్రహమునకు పెక్కు వందనము లొనగెను.

మరే:—గోవిందబాబూ! నీ కృతజ్ఞతకెంతయు సంతసించితిని. ప్రస్తుతము విలువుగల వస్త్ర మొకటియైన నీకు లేనట్లున్నది. ఇదిగో ఇరువదిరూపాయల నిచ్చుచున్నాను. తీసుకొనివెళ్ళి మంచి బట్టలు దుస్తులు తయారుచేసికొని వచ్చే సోమవారమునుండి పనిలో ప్రవేశింపుము. నేడే నీ పేరును రిజిష్టరులో వ్రాయించెదను.

గోవిందు డానందమగ్నుడై డైరక్టరు మరే కభివాదమొనర్చి యాతని యనుజ్ఞ గైకొని గృహోన్ముఖుఁ డయ్యెను.

---

పదమూడవ ప్రకరణము.

——:o:——

# దహనసంస్కారము.

అత్తగారి మరణమునకు గోపాలబాబు చాల విచారపడెను. దుఃఖితహృదయయైయున్న భార్యను శవసమీపమున కూర్చుండబెట్టి దహనసంస్కారమునకై ఇరుగు పొరుగు వారలను పిలువబోయెను. అందరును రాలేమని ప్రత్యుత్తరమిచ్చిరి. ఆ వీధిలోని వారినందరి నడిగెను. కాని గోపాలచంద్రునికి తోడుపడుటకు రాలేదు. కారణమేమనగా గోవిందుని వేరుపరచిన తరువాత వీధిలోని మగవారుకొందరు గోపాలచంద్రునిజూచి పవిత్రహృదయుడును సాధువైన సోదరుని వేరుచేయవలదని ఖండింపబోవ వారినందరిని తూలనాడి పంపెను. అందువలన నేడు వారందరు గోపాలునకు బుద్ధి రావలయుననియే మేము రాజాలమని చెప్పిరి.

గోపాలుడు విధిలేక తమ్మునియింటికేగెను. స్వర్ణమణి సావడి లోనుండి చూచి క్షేమసుందరి మరణముంగూర్చి పరామర్శతో గూడిన విచారమును వెల్లడించెను. తదుపరి యిట్లనియె.

స్వర్ణ:—ఇంటికి పెద్దదిక్కు పోయినది. ఇప్పుడు కర్తవ్యమేమి ?

గోపా:—కర్తవ్యము భగవంతుడు సూచింపవలయును. గోవిందుడున్నాడా ?

స్వర్ణ:—లేదు. నిన్న కలకత్తానుండి టెలిగ్రాము వచ్చుటచే వెళ్ళినాడు. ఇంకను నొకరిద్దరిని జూచి వత్తునని చెప్పి వెళ్లెను.

గోపా:—కలకత్తానుండి తంతివార్తయా ? ఆ కాగితము ఇచ్చటనున్నదా ?

స్వర్ణ:—ఉన్నదో—లేక వెంట తీసుకొని వెళ్ళెనో నాకు తెలియదు.

కమల యీ కాగితమును తెచ్చి స్వర్ణమణిముందు బఱచెను. స్వర్ణమణి దానిం గొని గోపాలచంద్రుని చేతబెట్టెను. గోపాలచంద్రుడా తంతివార్తను చదువుకొనెను. క్రింద డైరక్టరు మగే సంతకము జూచి నిర్విణ్ణుడయ్యెను. గతదినమున సోదరునివిషయమై తాను పల్కిన యసత్యము బయల్పడునను భీతి గలిగెను. కాని యీ సమయమున నేమి చేయుగలడు. మేనేజరు ధామ్న్యము కలదను ధైర్యముతో నూరకుండెను.

స్వర్ణ:—ఏమి రామా! టెలిగ్రాం చదివి తెల్లబోయితివేమి?

గోపా:—ఏమియును లేదు గోవిందు డీదినమున రాడేమోయని అనుమానము ఇంటినుండి శవము కదలలేదు. ప్రొద్దు పైకెక్కినది మధ్యాహ్నము దాటుచున్నది సాహాయ్యమున కెవ్వరును రాలేదు. ఏమా యని యాలోచించు చుంటిని.

స్వర్ణ:—సాధ్యమైనంతవరకు వచ్చితీరదనని చెప్పి వెళ్ళెను అచ్చటి విషయ మెట్లున్నదో?

రామచరణుడు వచ్చి యిట్లనియె. పెద్దబాబూ! శరచ్చంద్రబాబుగారి దగ్గరకు వెళ్ళినయెడల ఎవరినైన పంపగలరని అమ్మ చెప్పమన్నది.

గోపా:—ఇంటిదగ్గర శవమును జూచుచు మీ దొడ్డమ్మ ఒంటరిగ కూర్చుండలేక భయపడుచున్నది. స్వర్ణసోదరీ! రామునితో నీవొకమారు వెళ్ళి నామాటగా శరద్బాబుతో చెప్పిరమ్ము. నేనింటిదగ్గరకు పోయి కూర్చుండెదను

గోపాలచంద్రుడు శరచ్చంద్రుని కడకు పోవుట కిష్టములేక యిట్లుబొంకెను. గోవిందునివిషయమై వారిద్దరును కొంచెము వాద

ప్రతివాదములు జరిగియుండుటచే తాను వెళ్ళిన రాడేమోయని యట్లుచెప్పి స్వర్ణమణినిబంపెను. ఇంటికివచ్చుచు ఆఫీసులో తానవిన మాటలు, తంతివార్త, సోదరుడువెళ్లుట మొదలగు విషయములను తలపోయుచుండెను. ఇంతలో నొకపురుషు డాతని యెదుటనుండి పోవుచుండ గోపాలచంద్రు డాతనిగుర్తించి పలుకరించెను. ఆ పురుషుని ప్రవర్తనమెట్టిదో ముందు చదివినకొలది పాఠకులు గ్రహింప గలరు.

గోపా:—గంగారాం ! ఎక్కడకు బోవుచుంటివి ? ఒక్కమాటను విని వెళ్ళుము. నేను చాలకష్టములో నుంటిని

గంగా:—ఊరికే పిలువకుము. కడుపులో నౌషధము పడవలయును. కార్యము జరుగవలయును.

గోపా:—ఇదిగో ఒక రూపాయను తీసికొని త్వరగిరమ్ము. ముందు నా మాటను వినుము. మా బంధువు ఒకతె జబ్బుచేసి చని పోయినదానికి దహనసంస్కారము పూర్తిచేసి రావలయును. అట్లు చేసినచో నీ కింకను డబ్బు నొసంగెదను.

గంగా:—కడుపులో సారాయిపడినచో కావలసినంత పనిచేసెదను.

గోపా:—ఇదిగో రెండు రూపాయలను దీసుకొనిపోయి నీ పని పూర్తి చేసికొని యిద్దరు మనుష్యులను వెంట గొనిరమ్ము. శీఘ్రముగ రావలయును.

గంగా:—ఈ రెండు రూపాయలు నా కొక్కనికే చాలవుగదా మిగిలినవారి పని యెట్లు ? నా వలనకాదు.

గోపా:—పోనిమ్ము ఈ పదిరూపాయలు తీసికొనిపొమ్ము సత్వరముగ రావలయును.

గంగా:—నాకిన్ని మాటలు చెప్పనక్కరలేదు ఒక్క క్షణములో వచ్చెదను.

గంగారాముడు వెడలిపోయెను. గోపాలచంద్రుడింటికేగి భార్యనుజూచి ఇక్కడకు రెండుగంటలు దాటుచున్నది. శవము బైటికిబోవు సాధనము కానరాలేదు. అని పల్కుచు నిట్టూర్పు విడిచెను.

మోహి:—మీ తమ్ముడేమనెను ? నేనీ పిల్లలతో శవముదగ్గర నుండుట కష్టముగానున్నది.

గోపా:—తగిలిన కాలికే దెబ్బతగిలినట్లు కష్టముమీద మరియొక విపత్తు వచ్చినది. గోవిందునిగూర్చి నిన్న డైరెక్టరుగారు నన్ను ప్రశ్నించి అతనికొక యుద్యోగ మీయదలంచితిని నీ యభిప్రాయమేమని యడిగిరి ? నే నేప్పా కొన్ని యసత్యము లాడి యీ యుద్యోగమును మరియొకరి కిప్పింప దలచితిని. ఇంతలో నతనికేమి యనుమానముతోచెనో గోవిందునకు వార్తనంపి పిలిపించెను. గోవిందుడు కలకత్తా వెళ్ళెరాడు.

మోహి:—ఇప్పుడు గతియేమి ?

గోపా.—చూతము. ముందీ విపత్తు దాటిపోయినచో తరువాత యోజింతము.

మోహి:—నాకు తలతిరుగుచున్నది. ప్రభా! నీవు వెళ్ళి మీపిన్నితో నేను పిలుచుచుంటినని చెప్పి తీసుకొనిరమ్ము.

గోపా:—వచ్చునా ?

మోహి:—చూతము.

ప్రభావతి వెళ్ళి రెండునిముసములకు తిరిగివచ్చి యిట్లనియె. అమ్మా ! పిన్ని ఒక అరగంటతాళి వచ్చెదనని చెప్పినది. స్వర్ణమణి పిల్లవానిందీసుకొని శరచ్చంద్ర బాబుగారింటికి వెళ్ళినది. ఆమె తిరిగివచ్చిన వెంటనే వచ్చెదనని చెప్పినది.

ఇంతలో గంగారాముడు సురాపాన పరిశ్రమయందు తన కన్న రెండాకు లెక్కువ చదివిన యొక పరిచితుని వెంటబెట్టుకొని వచ్చెను. వానిపేరు నసీలాలు. గోపాలబాబు లోపలినుండి వచ్చెను.

గోపా:—గంగారాం! వచ్చితివా? ఆలస్యమేల? శవము వెలుపలకు వచ్చు సదుపాయము నాలోచింపుము.

గంగా:—ఏమియును తొందరలేదు. నసీ! ఒక్కగ్లాసు పుచ్చుకొనుము. తరువాత కర్రలను దెచ్చి కట్టెదము.

గంగారాము బట్టుకొనున్న సీసానుతీసి గ్లాసులోపోసి నసీలాలున కందిచ్చెను. నసీలాలు గడగడ త్రాగివేయుట తడవుగ గంగారాము దానిని మరలపూరించి గోపాలచంద్రుని జూచి గోపాలబాబూ! ఆలోచించెదవేమి? రమ్ము. నీవుకూడ నొకగ్లాసు సేవించినయెడల నుత్సాహముగా నుండును.

గోపా:—నా కభ్యాసము లేదు. అలవాటులేనిపని హానికరము.

గంగా:—సిగ్గుపడెదవేల. ఇచ్చట నెవరులేరు. నీవు రహస్యముగ కొంచెము కొంచెముగ త్రాగుచున్న సంగతిని మే మెరుంగమని తలంచితివా? రమ్ము. ఆలస్యము చేయకుము.

వీరు మువ్వురు మాట్లాడునది వెలుపల సావడి మోహిని లోపల తల్లి శవముదగ్గర కూర్చుండి యున్నది. గోపాలబాబు పూర్వమే కొంచెమలవాటుపడి యున్నకారణమున నసీలాలు గంగారాముల బలవంతమును త్రోసివేయ జాలకపోయెను. గోపాలబాబు మెత్తపడుటచూచి గంగారాము గ్లాసు చేతికిచ్చెను. గోపాలచంద్రుడు దిష్టములేనట్లు నటించుచు గ్లాసును పూర్తిచేసెను.

గంగా:—ఇంక నొకటి.

గోపా:—గంగారాం! ఇంకనేను త్రాగలేను. గొంతుక మండుచున్నది.

గంగా:—ఏమియు భయములేదు. ఇంకొకటి.

ఈ విధముగ గోపాలచంద్రునకు మూడునాలుగు గ్లాసులు సారాయినిచ్చి బలవంతముగ త్రాగించిరి.

గంగా:—నసీ ! ఇక చాలింపుము. అధికముగ త్రాగు నభ్యాసము లేదు. కర్రలను కట్టి సిద్ధముచేయుము. గోపాలబాబూ ! రమ్మి. ఇద్వారము లోనికేగి శవమును తీసికొనివత్తము.

గోపాలచంద్రుడు లోనికిబోవుచుండ వెనుక గంగారాముడు వచ్చుచుండెను. గోపాలబాబుకు మోతాదు వృద్ధియగుటచే సురాదేవి తనప్రభావము జూపనారంభించెను. లోపలి సావడిలో కాలు పెట్టటయే తడవుగ తల దిరుగుటచే మైకము తలకెక్కి యొడలు తెలియక స్పృహతప్పి పడిపోయెను. భర్తయొక్క స్థితిజూచి మోహిని భయకంపితయై తోడికోడలిని సత్వరముగ పిలుచుకొని రమ్మని ప్రభావతిని బంపి తానొకమూల నిల్చుండెను.

గోపాలబాబు స్మారకము తప్పియుండుటచే గంగారాము నసీలాలును పిలిచెను. ఇద్వరు లోపలప్రవేశించి శవమును తీయబోవు చుండ మూలనిల్చున్న మోహిని దుఃఖమును పట్టలేక రోదనమొనర్చెను. వాహకులిద్వరు శవమునువదలి ప్రక్కకుజూడ మోహిని నిలువబడియుండెను. గంగారాము నసీలాలును వెలుపలి సావడి లోనికి బిలిచి రహస్యముగ నిట్లనియె. ఈ సుందరి గోపాలబాబు భార్యవలెనున్నది. ఒడలిపై నగలున్నవి. విలువగల సామానున్నది. గోపాలబాబు పడియున్నాడు. శవమునూట దేవుడెరుగును ముందీ సామాను ఆమె శరీరముపై నగలు సంగ్రహించుకొని పాఱిపోవుదము. ఆడు దేమిచేయగలదు ? నసీలాలు దానికి సమ్మతించెను.

మోహిని వీరిద్వరి వేషములు రహస్యములను బరికింప నామెకనుమానము భయము మెండై వీధిలోనికి బారిపోవుదమను తలం

వుకో లోపలి సావిడికిగల ద్వారమును సమీపించునప్పటికి గంగా రాము సత్వరముగ నడ్డమువచ్చి సుందరీ ! ఎచ్చటికి పోయెదవు. నిలువుము మేము గోపాలబాబు అనుమతిమీాద నిచ్చటకు వచ్చితిమి. అని చెప్పుచుండగనే ప్రభావతిని కొంటబెట్టుకొని కమల సింహద్వారమును సమీపించెను. ననీలాలు కమలనుజూచి ఒరే ! గంగా ! ఇటుచూడు. ఇంటిలో పక్షి యెచ్చటికి పోగలదు ? మరియొక సుందరి మనచేత జిక్కినదని పలికెను. గంగారాముడా మాటలనువిని వెనుకకు జూచెను. తరుణము గనిపెట్టి మోహిని పరుగెత్తెను. దొంగలు దొంగలు ఇంట్లో దొంగలు ప్రవేశించినారు అని యారచుచు తలుపులను లోన బంధించెను

కమల లోనికిరాలేదు. అపరిచితులను జూచి యనుమానించుచు నిల్చుండ ననీలాలు ద్వారమును సమీపించి కమలను చేయి పట్టి లాగబోయెను. కమల ఒక్కవిసురున రెండుతలుపులను లాగి వెలుపల గొళ్లెముపెట్టెను. ఆ విసురులో కమలను బట్టుకొనుటకు చాచిన ననీలాలు చేతివేళ్ళు తలుపుసందున బడి నలిగిపోయెను. చచ్చితిసిరా ! బాబూ ! చచ్చితిని.

గంగా:—ననీ ! ఏమైనదిరా ?

ననీ:—ఇటూరారా బాబూ ! ఆ దిక్కుమాలిన దేవతెమో నాచేతి వేళ్ళను తలుపుసందున పెట్టి నలగగొట్టినది.

... నెమ్మదిగా వెళ్ళి ననీలాలును లేవదీయబోయి ఫు ... డుటచే తూలి క్రిందపడెను. ఆ పడుటలో తల తలుపునకు గట్టిగదగులుటచే గాయమయ్యెను. మోహిని లోపలి సావడితలుపులను బిగించుకొని తల్లిమరణము—భర్త స్మారకము తప్పియుండుట ఇంటిలో చోరులు ప్రవేశించుట—తలంచుకొని రోదనము చేయుచుండెను కమల వీధితలుపులను గొళ్ళెము

పెట్టి పోవుటచే గంగారాము—నసీలాలు—ఇద్దరును వెలుపలి సావడిలోనుండి పోవుటకు త్రోవలేక చిక్కుపడిరి. కమల ఇంటికేగు నప్పటికి గుణదా-కృష్ణవేణి పద్మమణి వచ్చియుండిరి. కమల వారందరితో జరిగిన వృత్తాంతమును జెప్పి వారినందరను వెంట బెట్టుకొని బావగారియింటి సింహద్వారమును సమీపించి ద్వారము నకు తాళమును బిగించెను. ఒంటరిగనున్న మోహినిని దోచుకొన దలంచిన నసీలాలు గంగారాములా సావడిలో బ ధింపబడిరి.

పద్మ:—ఇప్పుడేమిగతి ?

గుణ:—స్వర్ణమణి యింకారాలేదా ?

పద్మ:—మీరింటికి పొండు. నేను పిలుచుకొని పద్చెదను.

యెవరును రానక్కరలేదు. అనుచు స్వర్ణమణి యచ్చటకు వచ్చెను.

కమ:—స్వర్ణవది కీ ! నీవు వెళ్ళినపని యేమైనది ?

స్వర్ణ:—శరచ్చంద్రబాబాక కూనీకేసుయొక్క విచారణకై వెడలి పోయెను. ఇంకను రాలేదు. వచ్చినవెంటనే నీ స్నేహితు రాలు పంపగలదు. రామచరణు డచ్చటనే యున్నాడు.

కమల నసీలాలు గంగారాముల వృత్తాంతము నెరింగించెను. స్వర్ణమణి యాశ్చర్యపడి కమలతో కమలా ! నీవింటికిబొమ్ము. లేవ లేనిదానవు. నీవు ఎక్కువగ శ్రమపడజాలవు. నే నాదుష్టులకు బుద్ధి చెప్పించెదను. కృష్ణవేణీ ! నీవును కమలతో నింటికేగుము. పద్మ సోదరీ ! నీవు వీధిలోనికేగి ముఖర్జిబాబుగారింటికి బోయి గోవిందుని పేరుచెప్పి యెవరినైన పిలుచుకొసరమ్మా. నేను ద్వారముకడ కని పెట్టి యుండెదను. మగవారిద్వరు వచ్చినయెడల తలుపుతీసి లోనికి బోయెదను.

స్వర్ణమణి చెప్పినట్లందరును వారివారి పనులపై బోయిరి. ఒక్కతె ద్వారముకడ గూర్చుండెను. పదినిముసములకు కలకత్తాకు

ళ్ళినవె గోవిందుడు వచ్చుచుండెను. అతని రాకనుజూచి స్వర్ణమణి ధైర్యముతో నిల్చుండెను. గోవిందుడు సమీపించి చూడ అన్నగారి యింటితలుపు తాళమువేయబడి యుండుటజూచి యాశ్చర్యపడెను.

గోవిం:—సోదరీ ! తలుపులు తాళమువేసి యున్నవేమి ? సోదరు డెక్కడ ?

స్వర్ణ:—ముందు ఇంటికిబోయి బట్టలు మార్చుకొని కాలుచేతులు కడుగుకొని రమ్ము. తరువాత చెప్పెదను.

గోవిం:—సంగతియేమి? పిల్లలందరెచ్చట? అందరుసు కుశలమేనా?

స్వర్ణ:—అందరకును కుశలమే. భయములేదు. ఇంటికిబోయి సత్వ రముగ రమ్ము.

గోవిందచంద్రు డింటికిబోయెను. కమల కాళ్ళు కడుగుకొన చెంబుతో నీళ్ళు దెచ్చియిచ్చెను. గోవిందుడు కాలుచేతులు కడుగు కొని బట్టలు మార్చుకొని కమలనుజూచి విశేషములేమి ? అని యడిగెను.

కమ:—మీరు వచ్చుటచే ధైర్యము కలిగినది.

గోవిం:—అసలు జరిగిన విషయమేమో చెప్పవేమి ?

కమల నాటివృత్తాంతమంతయు నెరింగించియిట్లనియె. తోడి కోడలు కబురుపంపుటచే వెళ్ళితిని. ఇద్దరుదొంగలు ప్రాకివచ్చి లోపల ప్రవేశించినారు. నేను బయట గొళ్ళెముపెట్టి తలుపు బాధిం చితిని.

ప్రభావతి వెక్కివెక్కి యేడ్చుచు చిన్నబాబూ! ఆదొంగలు నాన్నగారి కేదియో తాగించినారు. స్మృతి తెలియక పడియున్నారు. అమ్మ చెల్లెలు తమ్ముడు లోపలనున్నారు.

గోవిం:—అమ్మాయీ ! భయపడకుము. మీ పిన్నిదగ్గిర కూర్చుం డుము. నేను వెళ్ళి విచారించెదను.

ఇంతలో రామచరణుని వెంటబెట్టుకొని శరచ్చంద్రబాబు వచ్చెను.

గోవిం:—శరద్బాబూ ! వచ్చితివా? నేడింకను భుజించినట్లు లేదే!

శర:—ఒక కూనీకేసు విచారింప వెళ్లితిని. మీ సోదరుని అత్తగారు పోయినదనియు ఉదయమునుండియు శవము కదలలేదని విని వచ్చితిని.

గోవిందుడు తాను వినిన వృత్తాంతము నెరింగించెను.

శర:—సరియే. రమ్ము. ఆ మహావీరులెవరో తెలిసికొందము.

శరచ్చంద్రబాబు గోవిందచంద్రుడు ద్వారమును సమీపించిరి. స్వర్ణమణి తలుపు తాళము దీసెను. ఇద్దరును లోన బ్రవేశించి గంగారాము—నవీలాలు ఇద్దరనుజూచి యాశ్చర్యపడిరి. గంగారాముడు వారిద్దరంజూచి రోదనధ్వని జేయుచు నిట్లనియె. బాబూ ! మా తప్పేమియును లేదు. గోపాలబాబుగారు శవమును దీసికొనిపోవుటకై మమ్ముర మ్మనిన వచ్చితిమి. ఎవ్వతెయో స్త్రీ వచ్చి మా వానిచేతులు తలుపులో పెట్టి నొక్కినది. నా శిరస్సునకు గాయమైనది.

నవీ:—బాబూ ! చూడండి. వేళ్ళు నలిగిపోయినవి.

ఈ సమయముననే పద్మమణి వెంట వీధిలోని జనము కొంత మంది యా ప్రదేశమునకు వచ్చిరి. వారిలో నొకడు వీరిద్దరం జూచి యాశ్చర్యపడి యిట్లనియె. ఈ త్రాగుబోతు లెట్లువచ్చిరి ?

గంగా:—మా తప్పు లేదు. మమ్మేమియు ననవలదు. గోపాలబాబు పిలిచిన వచ్చితిమి.

వెలుపలి గందరగోళమంతయు జూచి మోహిని ధైర్యముతో ద్వారమును దెరచి స్వర్ణమణిని బిలిచి యిట్లనియె. వదినే వీరిద్దరును దొంగలు. త్రాగుబోతులు. వారిచే బలవంతముగా త్రాగించి

స్మారకముతప్పునట్లు చేసి దొంగతనము జేయ ప్రయత్నించిరి. ఇంతలో కమలవచ్చుటచే వారివని సాగలేదు. వారి రహస్యములను విని లోపలి తలుపులను బంధించితిని.

స్వర్ణమణి యా వృత్తాంతమును నల్వురియెదుట ప్రకటించెను. వచ్చినవారిలో మరియొక డిట్లనియె. వీరిద్దరు త్రాగుబోతులు దొంగలు. మే మెఱుంగుదుము. బుద్ధి చెప్పవలయును. అని పల్కుటయే తడవుగ నటనున్న వా రందరును పాదప్రహారణముల తోడను గుద్దులతోడను మర్దించిరి. గోవిందుడు వలదని వారించెనుగాని యతని మాటను వినువా రెవ్వరు ? ఈ గందరగోళములో గోపాలచంద్రునకు స్పృహావచ్చెను. కాని లేవబోయి మరల క్రిందబడెను. ఒక్కనిమునమునకు మరల నెమ్మదిగ లేచి కూర్చుండి నలుప్రక్కల జూచెను. గోవిందుడు మొదలగువారు కనపడిరి. గోవిందా ! వచ్చితివా ? మీరందరు కొంచెము ముందువచ్చినచో నే నీ త్రాగుబోతులను పిలువవలసిన యక్కర లేకుండెడిది. సరియే ఈ దొంగలను సాగనంపి శవమును రుద్రభూమి చేర్చుమార్గము చూడుము.

గోవిం:—మీ కా చింత యవసరములేదు. ఆ పనియంతయు నేను చూచెదను. నీవు విశ్రాంతిని దీసికొనుము.

గంగా:—గోవిందబాబూ ! క్షమించి మమ్ము వదలుడు.

శర:—మీ కింకను మత్తువదల లేదు. మీరు వెళ్లుట కశక్తులై యున్నారు. నేను పంపించెదను.

నసీ:—అక్కర లేదు. బాబూజీ ! మేము వెళ్ళగలము.

ఇర్వురు రక్షకభటులా ప్రదేశమునకు వచ్చి శరచ్చంద్రునకు నమస్కరించి నిలువబడిరి.

శర:—తేజసింగూ ! సూర్యమల్ ! వీరి నిర్వురను స్టేషనుకు తీసుకొనివెళ్ళి బంధింపుడు.

గోవిం:—శరద్బాబూ ! వారలకు జరిగిన దండనము చాలును వద లుడు.

శర:—నీకు తెలియదు. వీరినంత తేలికగ వదలరాదు.

గంగా:—బాబూ ! నీ వెట్టి పెద్దమనిషివయ్యా ! మే ముపకారము చేయవచ్చితిమిగాని యూరక రాలేదు. గోపాలబాబు ఇంటికి రమ్మనమని పిలిచిన వచ్చితిమి. ఇందులకు మాకు శిక్ష కాబోలు.

గోపా:—బహుమానము. శవమును దీసికొని పోవవచ్చి దొంగతన మున కుపక్రమించినందులకు బహుమానము.

శర:—తేజసింగు ! తీసుకొనిపొమ్ము.

ననీ:—చాలు. చాలు. బుద్ధిమంతుడవు. గోవిందబాబుగారు వదల మని చెప్పుచుండ స్టేషనుకు బంపెదవేమి

సూర్యమల్లు వారి నిర్వురను చెరియొక తన్నుతన్ని ఫాజే ! నోరుమూయుము. సర్కిలు ఇనస్పెక్టరుగారి యెదుట మాట్లాడెదవా గాడిదా ! గుర్తించలేదా ?

ననీలాలు గంగారాములుకు ప్రాణములుపోయెను. తేజసింహ సూర్యమల్లులు వారినిర్వురను తన్నుకొనుచు స్టేషనుకు తీసుకొని పోయిరి.

శర:—గోవిందా! ఇంకనాలస్యమేల సాయంకాలము దాటుచున్నది. నిన్నరాత్రిశవము ఆగుటచే మిగుల బరువుగ నుండును. శీఘ్రమే రుద్రభూమికి జేర్చవలయును రమ్ము.

స్వర్ణ:—గోవిందా ! నీవు రుద్రభూమికి వెళ్ళగూడదు. కమల గర్భవతియగుటచే నీ వటకు పోరాదు. నిషేధము.

శర:—ఔను మా యాముదాండ్రవలన వినియుంటిని. నీవుండుము నేను నల్వురు భటులను పిలిపించెదను.

పద్మమణి వెంటవచ్చిన యితర పెద్దమనుష్యులు ముందునకు

వచ్చి శరద్బాబూ! మీ కేమియు శ్రమయక్కర లేదు. గోపాల బాబు మమ్మందరి నొకమారు చాల కఠినముగ తూలనాడుటచే మేమింతవరకును రాలేదు. అదియును గోవిందబాబుగారి విషయమే కాని యితరుల సంగతి కాదు. ఇప్పుడు మీరిర్వురు వచ్చియుండుటచే మాకెట్టి యభ్యంతరము లేదు. దహన సంస్కార కార్యమును మేము పూర్తిచేసెదము. అని పల్కుచు క్షేమాసుందరి యొక్క మృతదేహమును వెలుపలికి దెచ్చి కట్టెపై బంధించి మోసికొని పోయిరి.

శర:—గోవిందబాబూ! నేటిరాత్రియంతయు నిర్వురు పోలీసువారి యింటికి పహరా యిచ్చుచుందురు. నీ కేమియు భయము క్కర లేదు. ఇంటికి పొమ్ము. గోపాలబాబున కింకను సరియైన తెలివిరాలేదు. దహనవ్యయమునకై నీవద్ద పైకములేదు. కావున నేను డబ్బు పంపెదను.

గోవిం:—అక్కర లేదు. నేనువచ్చునప్పుడు డైరక్టరుగారు బట్టలు వగైరాలుకొనుట కిరువది రూప్యము లిచ్చియున్నారు. అది సరిపోవును. నీ దయవలననే నాకు నెలకు రెండువందల రూపాయల వేతనముపై యుద్యోగమిచ్చెను. కనుక నీకు శ్రమయక్కర లేదు. నేను రుద్రభూమికిపోయి దూరముగా నుండెదను.

శర:—సరియే నీ యిష్టము.

గోవిందుడు శ్మశానమునకు బోయెను. నల్వురుకలసి క్షేమా సుందరియొక్క మృతదేహమును సంపూర్తిగ దహనము గావించిరి.

---

పదునాలుగవ ప్రకరణము.

—:o:—

# బీదలకు దానము.

శరచ్చంద్రుడు స్టేషనుకు వెళ్ళి నసీలాలు-గంగారాములను బిలిపించెను. వా రిర్వురు శరచ్చంద్రుని కాళ్ళపైబడి రోదన మొన ర్చుచు నిట్లనిరి.

గంగా:—బాబూ! మేము మి మ్మెరుంగము. సబ్ ఇన్స్పెక్టరు కాళీబాబుగారి నౌకరుంగుదము. మమ్ము అనుగ్రహించి వదలి వేయుడు. ఇంకమీాద నెప్పుడిట్టి పనుల జేయము.

నసీ:— అయ్యా! బుద్ధి వచ్చినది వదలుడు.

శర:—మీారు ద్రోహులు. కొంపల మాపుటలో వెనుదీయని పాత కులు. మిమ్ము సామాన్యముగ వదల రాదు.

నసీ:—బాబూ! ఇంకొకమా రిట్టి పని చేసినచో మీా యిష్టము వచ్చినట్లు శిక్షింపుడు. ఇప్పటికి మా చేతులు కాళ్ళు నలిగి నవి. క్షమింపుడు.

శర:—పెద్దమనిషి గోవిందబాబు చెప్పుటచే నిప్పటికి వదలుచుంటిని. ఇంకమీాద మీారీవిధముగ సంచరించినచో శాశ్వతముగ శిక్షించెదను. జాగ్రత్త.

అనిచెప్పి కాళీబాబును పిలిచి జరిగిన యావద్వృత్తాంతము నకు వాఙ్మూలమును దీసికొని వారిచేత సంతకములు చేయించుకొని పంపుమని యానతిచ్చెను. కాళీబాబు వెంటనే యా కార్యమును పూర్తిచేసి వారి బంధనములను వదలించెను.

శర:— మీా జీవితములో నెన్నడైన నిట్టి దుష్కార్యముల నొనర్చి నచో మీాకింక జీవితముపై ఆశ వదలుకొనుడు.

గంగారాము-నసీలాలు-ఇరువురు రెండు వెంపలు వాయించుకొని వందనముచేసి వెడలిపోయిరి. తేజసింగునివలన దెబ్బలను తప్పించుకొనుటకు తమ్ము విడుదల గావించుటకును కాళీబాబునకు లంచమిచ్చెదమని వారిద్దరు వాగ్దానమొనర్చి యుండుటచే కాళీబాబు తేజసింగుతో చెప్పి దెబ్బలను మాన్పించెను.

శరచ్చంద్రుడు ఇర్వురు భటులను గోపాలచంద్రుని యింటి రక్షణనిమిత్తమై పంపి యింటికి బోయెను. నాడధికముగ శ్రమపడి యుండుటచే భుజించిన వెంటనే పరుండి నిద్రపోయెను. మరునాటి యుదయమున కాలకృత్యములు తీర్చుకొని గోవిందుని యింటి కేగెను.

గోవిం:—శరద్బాబూ! రమ్ము. నావలన నిన్న నీ కెంతయో శ్రమ కలిగినది.

శర:—నాకేమియు భయము లేదు. ప్రజల కాపత్కాలమున తోడ్పడుటయే మా పోలీసుశాఖయొక్క ముఖ్యకర్మము. రాత్రి దహనకర్మ పూర్తియైనదా?

గోవిం:—అయినది. కాని శవము చిరకాలము నిలువ యుండుటచే దహనమగుట కష్టమైనది. మే మందరము రాత్రి యింటికి జేరునప్పటికి పదిగంటలైనది. ఏదియెట్లున్నను నిన్న నీవు భగవంతునివలె వచ్చి యడ్డపడితివి. నీ మేలు మరువరాదు.

శర:—నీవు పెక్కుసారు లట్లనవలదు. నాకు కష్టముగ నుండును. ఈ జీవితమధ్యమున నీవంటి మిత్రుని వేరొకనిని సంపాదించ నలేను. అట్టి నన్నుగూర్చి శ్రమపడుట యట్లుండ నా అధికారధర్మమును బట్టియును కర్తవ్యమై యున్నది. నిన్న రాత్రి మీరు వచ్చినతరువాత మీ అన్నగారు వచ్చినారా?

గోవిం:—రాలేదు. మే మింటికి జేరునప్పటికి సోదరుని యింట నందరు నిద్రించుచుండిరి నేను వెళ్ళి పిల్లలనుమాత్రము లేపి

# పదునాలుగవ ప్రకరణము.

వారికి కొని తీసుకొనివచ్చిన మిఠాయిని తినిపించి పరుండ బెట్టి వచ్చితిని.

శర:—తనకొఱకింత శ్రమపడినను నీ దగ్గరకు రాలేదుగా ?

గోవిం:—రాలేదు. ఇంకొక గంటసేపాగి నేనే వెళ్లెదను.

శర:—నీ వటకు వెళ్లుట నా యభిప్రాయము కాదు. మన యిద్దరి యందతనికి సదభిప్రాయము లేదు. నే నిప్పుడు మీ యింటికి వచ్చుచుండ నన్నుజూచి లోపలికిపోయెను. అంతియే గాని పలుకరించ లేదు.

గోవిం:—ఏదియైన తొందరపనిమీద వెళ్ళెనేమో! అదట్లుంచుము. నాకు తల తిరుగుచున్నది కళ్ళు మూడుచున్నవి. నిలువజాలకున్నాను. నే డాదివారము. నాన్నగారు ప్రతి ఆదివారము బీదలకు దానధర్మము శక్తికొలది జేసెడివారు. ఈశ్వరానుగ్రహమువలన మరే నా కుద్యోగ మొసగినాడు. అందువలన స్వర్గస్థులైన నాన్నగారుచేసిన ధర్మమును మరల నిలువబెట్ట వలయునని నా నిశ్చయము. ఇద్దరము గూర్చుండి బీదలకు ధర్మము చేయవలయునని తలంచితిని గాని నిలువ లేకుంటిని. ఈ నాడు నీ వీ కార్యమును నడుపుటకు పూనుకొనవలయునని నా నిశ్చయము.

శర:—అందుల కభ్యంతరమేమి. నీవు రామచరణుని గుమ్మములో గూర్చుండబెట్టి పరుండుము. నే నిప్పుడే మరలి వచ్చెదను.

గోవిం:—ఈ మధ్యకాలములో నీ ధర్మము నిలుపుదల యగుటచే బిచ్చగాండ్రు నేనులేకున్న వెడలిపోయెదరు.

శర:—మరేమియును భయము లేదు. పోకుండ నిలువబెట్టెదను.

గోవిం:—అట్లయినచో రామచరణుని బంపెదను. నీ కెట్లుతోచిన నట్లు చేయుము.

గోవిందచంద్రుడు లోనికేగి కుమారుని శరచ్చంద్రుని కడకు బంపి స్నానముచేసి భుజించి గతదినమందలి ప్రయాణపు బడలిక—శరీరశ్రమ—రాత్రి నిద్రలేకుండుట—మొదలగు కారణములచే పరుండెను.

శరచ్చంద్రు డింటికేగి కొంతద్రవ్యమును గొనివచ్చి గోవిందుని యింటి సావడిలో కూర్చుండెను. భటుడొకడు బియ్యమును సంచిలో పోసితెచ్చి యుంచెను. నాడు పదిగంటలవరకు ముష్టివాండ్రకు బియ్యము—అంగవైకల్యులకు డబ్బులును—బీదవిద్యార్థులకు చదువుకొనుటకై కాగితములు—పెన్సిళ్లు—పలకలు పుస్తకములకై కొంతద్రవ్యము ధర్మముచేయబడెను. అందరును ప్రసన్నచిత్తులై శ్యామసుందరబాబుగారి ధర్మము మరల నిలుపబడినదని స్తోత్రముచేసి దీవించుచు ధర్మమునుగొని యిండ్ల కేగిరి.

నాటి సాయంకాలము గోవిందుడా ధర్మమునకైన ధనమును శరచ్చంద్రుని చేతబెట్టెను. గాని దాని నతడు గైకొనక దీని వేరొక సత్కార్యమునకై వినియోగించుమని చెప్పెను.

---

పదునైదవ ప్రకరణము.

———:o:———

## మోహినియొక్క సలహా.

గోవిందుని యింటిముందు జరిగిన ధర్మకార్యమునుగూర్చి గోపాలచంద్రునకు చాల కష్టముగా నుండుటయేగాక గోవింద శరచ్చంద్రులపై మిక్కిలి కోపమువచ్చెను. ఇంటిలోనికేగి భార్యయెదుట గోవిందుని చాల నిందించెను. అనుకూలపత్నియైన మోహిని తను

ణము గనిపెట్టి పెన్మిటికి సోదరునిపై క్రోధము వృద్ధియగునట్లు చేయ దలంచెను. వారిర్వురును గతదినమందు గోవిందునివలన గలిగిన మహోపకారమునకు సంతసింపక పోవుటయుండ నైగా నిందింపసాగిరి.

మోహి:—మీ తమ్ముడు సామాన్యుడుకాడు. నిన్నవీధిలో ఒకడైన మీరు పిలిచినప్పుడు రాక గోవిందుడు వచ్చినవెంటనే సిద్ధపడినారు.

దీనింబట్టి యీ వీధిలోనివారినందరిని కట్టుగట్టినట్లు తెలియుట లేదా ? వీనికితోడా శరచ్చంద్రుడొకడు దాపరించెను. ఆ త్రాగుబోతుల నిరువురను శరచ్చంద్రుడే పంపియుండునని నా యనుమానము లేకున్న మీ యింటికి వచ్చి మీచే బలవంతముగ త్రాగింపగలరా ?

గోపా:—గంగారాముని రమ్మని పిలిచినది నేనే. నిన్నటి స్థితిగతులనుబట్టి నన్నట్లు త్రాగించుటయును మంచిదైనది. ఎక్కడికి తిరుగకుండ శ్రమపడ నవసరము లేకుండ కావలసినపని యంతయు జరిగినది. నిజముగ సారాయి త్రాగుటవలన శరీరమున కుత్సాహము ఆనందము కలుగును. ఏదీ ! అలమారులోని సారాయిసీసా నిటు తెమ్ము.

మోహి:—నే నా దుష్పదార్థమును స్పృశింపను. కావలయునన్న మీరే తెచ్చుకొని త్రాగండి.

గోపా:—నేను త్రాగుచుంటినిగాని నీవు స్పృశింపజాలవా ? కచేరీలోని సంగతి యేమయ్యెనా యను భయమంతయు నిన్న త్రాగుటవలన నంతరించినది. నేటి ప్రాతఃకాలమునుండియు మరల కచేరీభయము డైరెక్టరుభయము ప్రారంభమైనది అందువలన నొకబుడ్డికొని తెచ్చియుంచితిని. రెండుగ్లాసులు త్రాగిన నొడలు తెలియుని నిద్రపట్టును. దానితో నితర చింతలేమియు నుండవు.

మోహి:—చాలుచాలు ఇక కట్టిపెట్టండి. నిన్న జరిగిన యవమానము చాలు. ఇంక నా విషమును గొనిపోయి తూములో పారబోయుడు.

గోపా:—ఏమియు భయములేదు. త్రాగుటవలన నెంత యానందమున్నదో నీకేమి తెలియును ?

గ్లాసులో సారాయిపోసి త్రాగుటకు ప్రారంభించెను.

మోహి:—యదార్థముగ మీకు మతిపోయినది. ఆవల నౌకరీ యేమగునో యను చింత లేదు.

వీధిలోని వా రందరును విరోధులై పోయిరను విచారములేదు. ఎవ్వరైన చూచిన నవ్వుదురను సిగ్గులేదు. అన్నింటిని వదలి త్రాగుటయే ప్రథమ కర్తవ్యమని భావించుటయా !

గోపా:—అన్నియు నెరుగుదును కాని యేమిచేయగలను? కన్నులు మూసినచో డైరక్టరు మరేయొక్క స్వరూపము కాన్పించు చున్నది. గోవిందుకు వెనుక జరిగిన వృత్తాంతమంతయు దెలిపి యుండెనా ? నౌకరీ పోవుట నిజము.

మోహి:—దీనికింత భయమేల ? మీరువెళ్ళి గోవిందుడు చెప్పిన దంతయు నసత్యమనియు—మీపై విరోధముచే నట్లు చెప్పెననియు తెలియజేయుడు.

గోపా:—చివరకు అట్లే చెప్పవలయును. కాని నిన్న వారిద్వార కేమి సంభాషణము జరిగెనో—గోవిందునకు నౌకరీ లభించినదో లేదో తెలియవలయును.

మోహి:—ఒక్కమారు మీ తమ్ముని పిలిపించెదను. అడుగుడు. మీ యెదుట నతడబద్ధమాడడు. ప్రభా ! ఒక్కమారు మీ నాన్నగారు పిలుచుచున్నారని చెప్పి-చిన్నబాబును పిలుచుకొనిరమ్ము.

ప్రభావతి తల్లి యాజ్ఞానుసారము వెళ్ళివచ్చి యిట్లనియె. అమ్మా ! చిన్నబాబుకు శరీరములో స్వస్థతగా లేకపోవుటచే పరున్నారు. నిద్రనుండి లేచినవెంటనే పంపెదనని పిన్ని చెప్పినది. మరియు నీ దినమున మనలనందరిని భోజనమున కక్కడికే రమ్మని చెప్పినది.

మోహి:—చూచితిరా ! నిద్రనుండి లేపక మాటలుచెప్పి సాగనంపుటయేగాక మనలను భోజనమునకు పిలిచినది. ప్రభా ! భోజనమున కెవ్వరును రారని చెప్పిరమ్మా.

గోపా:—ప్రభావతిని మరల పంపకుము. ఇప్పుడు నీ తోడికోడలు మనలను భోజనమునకు పిలువవచ్చును. అప్పుడామెతో చెప్పుము.

మోహి:—కమలపై మీ కభిమానము పోలేదు. మీ వేషము. సారాయిబుడ్డి సీసా. గ్లాసు చూచినయెడల నావితంతువులతో వెల్లడింపక మానదు. వా రూరంతయు చాటెదరు. యింత తాగుబోతుతనము పనికిరాదు.

గోపా:—నిన్న నొక్కమారుగా నాలుగైదు గ్లాసులు త్రాగుటచే నట్లైనది. గాని కొంచెము కొంచెముగా పుచ్చుకొనినచో భయమేమియును లేదు.

సీసా గ్లాసు చేతబట్టుకొని గోపాలచంద్రుడు లోపలి గదిలోని కేగెను. దూరమునుండి కమల వచ్చుటజూచి మోహిని విచారముఖమున గూర్చుండెను. కమలవచ్చి ప్రక్కను గూర్చుండి సోదరీ! ఏల విచారించెదవు ? విచారించిన చనిపోయినవారు తిరిగి వత్తురా ? ఇంతకును ఆమె పెద్దది. ఏనాటికి ఎట్టి స్థితి కలుగునో యెవరు చెప్పగలరు. నే నిప్పుడిక్కడకు వచ్చితిని. ఇంటికిజేరు లోపల జరుగు సంగతి యేమో నాకు తెలియునా ? దైవసంకల్పమునకు మనము కర్తలముకాము. ఊరడిల్లుము. అని యోదార్చెను.

మోహి:—ఇంటికి జేరులోపల వచ్చు పనిమాద మేమియును లేదు. రాదు. నూతనసంసారము—క్రొత్తగావచ్చుచున్న స్వాతంత్ర్యము. వీనియొక్క భోగ మనుభవించక ముందే ప్రమాదమా! ఆ వితంతువు లందరు నున్నారా?

కమ:—సోదరీ! ఆ వితంతువులను గురించియే మమ్ము వేరుపరచితివా యేమి? వారందరుండక నెక్కడికిపోయెదరు? ఏదో యొకవిధముగ దినములను గడపుచుంటిమి.

మోహి:—ఏదోయొక విధ మేమి? బాగుగనే గడచుచున్నది. ఉదయమునుండి గుమ్మస్తుముందు మామగారి కాలమున జరిగిన దానికన్న నధికముగనే దానధర్మములు జరిగినవి. కాని అన్నగారు రమ్మని వార్తపంపిన రాలేకపోవుట-జబ్బు-సుస్తి మొదలగునవి వచ్చినవి.

కమ:—నేటి యుదయమున జరిగిన దానధర్మములతో మీ మరదికేమి సంబంధమున్నది? ఆ కార్యము నడపినది శరచ్చంద్ర బాబుగారు. రాత్రి నిద్రలేకపోవుటయే బద్ధకముగనుండి పరుండుటచే లేపుటకు సాహసింపలేదు. మీ కందరకును వంటచేయించితిని భోజనమునకు రమ్మని పిలువవచ్చితిని.

మోహి:—మీ కంతశ్రమ యవసరము లేదు. నేను వంటచేసితిని. ఇక్కడనే భుజింపగలరు. సరేగాని మీవారు నిన్న నుద్యోగముకొఱకు వెళ్లినసంగతి యేమైనది.

కమ:—నా కా వివర మేమియును తెలియదు. ఏదియో నౌకరీ దొరకినదని శరచ్చంద్రబాబుగారితో ననుచుండ వినియుంటిని.

మోహి:—జీత మెంత?

కమ:—బావగారి జీతముతో సమానమనివింటిని. నిజము తెలియదు.

మోహినికి శరీరమంతయు నీర్ష్యాగ్నిచే రవులుకొనెను. ఈ విధముగ సంభాషణము జరుగుచుండ స్వర్ణమణి వచ్చెను. వెంటనే ప్రసంగమాగెను. కమలవలన యావద్వృత్తాంతమును తెలిసికొనదలంచెను గాని స్వర్ణమణి రాకవలన యామె సంకల్ప మడుగంటెను.

స్వర్ణ:—కమలా! ఇక్కడ కూర్చుంటివేమి? నీవు వచ్చినవని యేమైనది?

కమ:—మే మందర మిక్కడనే భుజింతుమని సోదరి చెప్పుచున్నది.

స్వర్ణ:—అట్లయిన వెంటనే రాక యిట కూర్చుంటివేమి? రమ్ము. ఉన్నకొలది నేదియో ప్రసంగము రాకమానదు. నోటిలో నూపుగింజ నానదు. మోహినీ! మీయింట నెవ్వరును రాద లంచుకొనలేదా?

మోహి:—తలంచుకొనలేదమ్మా! లేదు. లేదు. యెన్నిమారులు చెప్పవలయును?

స్వర్ణ:—మాట్లాడుటయే కష్టముగానున్న ప్రదేశమునకు కమల యెట్లు వచ్చినదోగాని నే నయినచో గుమ్మమును కంటితో నయిన చూడను.

మీరురాకున్నచో మాకింక దినములు గడచుటెట్లు? అని దీర్ఘముతీయుచు మోహిని కేకవైచెను. ఆ కేకతో కమల సిగ్గుపడి వీథిలోనికివచ్చి స్వర్ణమణిని కేకవైచెను. గాని స్వర్ణమణి ప్రత్యు త్తరమొసంగక వచ్చినదికాదు.

స్వర్ణ:—మోహినీ! నేడు నీ నోరింత పెద్దదైన దేమి? నిన్నటి సం గతిని మరచితివా?

మోహి:—పోట్లాడవచ్చితివా యేమి? మిమ్ము రమ్మని పిలిచినవా రెవరు? శీఘ్రముగా పొమ్ము.

స్వర్ణ:— పిలుపుట చేతనే వచ్చితిమి ? అసత్యమాడెదవేల ? నీకేకలకు నీ యదలింపులకు భయపడువారు లేరు. యేరు దాటినపిదప తెప్పను తగులబెట్టుట మంచిదికాదు. మేము రాకున్న నిన్న నీ స్థితి ఏమైయుండునో ఆలోచించుకొనుము.

వీరిస్వారికేకలను విని గోపాలచంద్రుడు వెలుపలికివచ్చెను.

స్వర్ణమణి వాని వాలకమంతయు గమనించి ఆహా ! సురాపానము కూడ ప్రారంభించితివా ?

గోపా:—తప్పేమి ? చాలమంచిపదార్థము. దూరమాలోచించియే యీ కార్యమును ప్రారంభించితిని.

స్వర్ణ:—నీ వింత యధఃపతితుడవైన సంగతి నెఱుంగను. కమలా ! పద మనమిక్కడ నిలువరాదు.

స్వర్ణమణి కమలతో వెడలిపోయెను.

మోహి:—చూచితిరా ! ఈ నితంతువుయొక్క ధైర్య సాహసములు ! పోయి నాలుగు చివాట్లు పెట్టిరండు.

గోపా:—ఇప్పుడు కాదు. సాయంత్రము గోవిందునితో మాటలాడి కర్తవ్యమును నిర్ధారణము జేసెదను.

మోహి:—సరియే. నేను వంట జేసెదను.

మోహిని వెడలిపోయినతోడనే గోపాలబాబు రెండుగ్లాసులు పూర్తిజేసెను.

---

పదునాఱవ ప్రకరణము.

——:o:——

# మోసము.

వనీలాలు గంగారాములకిద్దరకును విడుదలయైనది. కాని వారిద్దరును గోపాలచంద్రునిపై మిక్కిలి కోపముతో నుండుటయే గాక సమయము దొరికినయెడల కసిదీర్చుకొనవలచి యుండుటచే యందులకు మార్గమెట్లాయని తలంచుచు నొకనాడు ప్రతాపచంద్రరాయని బంగాళాకు బయలుదేరిరి.

ప్రతాపచంద్రుడొక భ్రష్టచరిత్రుడగు ధనాఢ్యవ్యక్తి. సురాపానము—ద్యూతము—పరస్త్రీ గమనము నను నీ మూడు కార్యములతని కత్యంతప్రీతి. వనీలాలు గంగారాములు—సురాపాన పరస్త్రీ గమనములందు ప్రతాపునకెంతయు సహకారులును సహచరులు నగుటచే తరచుగ నతనివలన ధనలాభమును బొందుచుందురు.

గ్రామములో సుందరియగు స్త్రీ కంటబడినచో—ధనముననో బలముననో—భయముననో స్వాధీనము చేసికొనక మానడు. అందువలన నభిమానవతియగు యువతి బైటకు రా వెఱచును.

ప్రతాపచంద్రుడు వనీలాలు గంగారాములను జూచి హసన్ముఖుడై పలుకరించెను.

ప్రతా:—ఏమిసమాచారము ఏదియైన క్రొత్తపక్షి చేతికిజిక్కినా?

గంగా:—చిక్కినదిగాని యదృష్టహీనతవలన చేయి జారిపోయినది.

నరిగదా! దేహమంతయు దెబ్బలతో నిండిపోయినది.

ప్రతా:—నీవిట్లు కనబడుచుంటివేమి? వనీలాలు వేళ్ళకు కట్టుగట్టెనేమో?

గంగా:—సుందరమైన పక్షి కంటబడినది. మీ కొరకు పట్టితీసుకొని

రా బ్రియత్నించితిమి. ఇంతలో మరియొకతె వచ్చి మా కీ గతిని గల్గించినది. అంతతో బోసీయకు పదిమందిని బ్రోవు చేసి దేహశుద్ధిని జేయించినది.

ప్రతా:—ఇటువంటి కార్యములలో దిగినవారికి బ్రయత్నించువారికి నప్పుడప్పుడిట్టి యవస్థలు తటస్థించుచుండును గాని సహన ముండవలయును. లేకున్న మీకు ధనలాభ మెట్లు కలుగును? కూర్చుండి చెరియొక గ్లాసును పుచ్చుకొనుడు.

సనీ:—మహానుభావా! మీ కనేక వందనములు. మీవంటి పుణ్యాత్ములే లేనియెడల మే మీపాటికి మరణించి యుందుము.

ప్రతాపచంద్రుని స్తుతించుచు బల్లపై కూర్చుండి సారాయిని గ్లాసులోపోసి సేవింపసాగిరి పిదప నొకగ్లాసులోపోసి ప్రతాపుని నోటి కందిచ్చి త్రాగుమని బలవంతపరచిరి. ప్రతాపుడు సగము త్రాగి చాల ఘాటుగానున్నదని ముఖము త్రిప్పివేసెను. మిగిలిన దానిని వారిర్వురు పూర్తిచేసిరి.

సనీ:—చాలదినములనుండి యిటువంటి సరుకును రుచిచూడలేదు.

ప్రతా:—క్రిందటి ఆదివారమేగదా! అప్పుడే మరచితివా ?

గంగా:—ఔను జ్ఞప్తికివచ్చినది.

ప్రతా:—గంగారాం! ఇంతకుముందు నీవుచెప్పిన స్త్రీ చక్కనిదేనా?

గంగా:—చాల చక్కనిది. ఆ కనుల సోయగము—ఆ ముఖమండలముతీరు—ఆ యవ్వనము—అహా! చూడగనే కన్నులు తిరిగి పోయినవి ఎట్లైన కష్టపడి మీవంటివారా సుందరి ననుభవింపవలసినదే. శవవాహకత్వమునకు పిలిచి లేనిపోని దొంగతనమును మోపి మమ్ము గొట్టించినందులకు దానికి ప్రాయశ్చిత్తము కావలయును.

ప్రతా:—ఆమె యీ గ్రామమునకు కోడలా! లేక పుట్టినయింటి యాడుపడుచా? సధవయా! విధవయా?

గంగా:—కలకత్తాలో నొకకంపెనీలో పనిచేసి చనిపోయిన శ్యాను సుందర బాబుగారి నెఱుగుదురా? వారికిద్దరు కొమరులు. అందులో పెద్దవాడయిన గోపాలచంద్రుని భార్య. స్వర్గ లోకమునుండి దిగివచ్చిన అప్సరస. మనముకోరెదము ప్రయ త్నముచేసిన లాభించును. ఇప్పుడన్నదమ్ముల కిర్వురకు పడుట లేదు. వేరైనారు. వీధిలోనివారికి గూడ గోపాలబాబన్న గిట్టదు. ఒంటరి కాపురము దానికితోడు అత్తగారు చనిపో వుటచే వంటచేసే మనిషికొఱకు ప్రయత్నించుచున్నాడట.

ప్రతా:—రెండవవాని భార్యయో?

గంగా:—ఆమెయు సుందరియే కాని ఇంత సులభ్య సాధ్యురాలు కాదు. నల్వురు వితంతువు లెల్లప్పుడామెను చుట్టియుందురు. వారిని మరపించు టెవ్వరికిని తరముకాదు. ఇదిగాక వేరొక కారణమున్నది. అందువలన నామెసంగతిని విరమించి పెద్ద కోడలి విషయమై ప్రయత్నింపుడు.

ప్రతా:—అంత సుందరాంగియా?

గంగా:—జగన్మోహిని.

ప్రతా:—అట్లయినయెడల నెంతధనము వ్యయమైనను సరియే. భయములేదు తీసుకొనిరండు. ఆలస్యము చేయవలదు. గృహ కల్లోలమిట్టి కార్యములకు మహోపకారి. ఏ కారణమున నయిన వారిర్వురు మరల నేకమైనచో మనకామె స్వాధీన మగుట కష్టము. ఏదియో యుపాయమును సత్వరమాలో చింపుడు.

గంగా:—గోపాలబాబుభార్య యొంటరిగనున్నది. ఒక వంటమనిషి కావలయును. అందులకై మే మిప్పుడు ప్యారీలాలు దగ్గరకు

వెళ్ళి యతని మేనత్తను వంటమనిషిగా నేర్పాటు చేయించెదము. ఆమె పెద్దది చాతుర్యముకలది. మనుష్యులను నిముసములో స్వాధీనము చేసికొనగలదు. ఇంకొక పావుగంటలో అతనియింటిలోని దాసి మోక్షదాయను నామె మీయింటికే రాగలదు. ధనాశజూపిన యెట్టి పనియైన జేయును. వీరిద్దరి వలన మనపని పూర్తియగును.

పరితా:— అదిగో మాటలోనే వచ్చుచున్నది. మోక్షదా ! రమ్ము. నీ కింకను నూరేండ్లాయువు వున్నది.

మోక్ష:— బాబూ ! ముసలిదానిపై నేటింత యనుగ్రహము వచ్చినదేమి ?

పరితా:— సంసారనటన యంతయు ముదుసలులపై యాధారపడి యున్నది. దానికేమి నాకొక పనిగావలయును. చేసెదవా ? నీకు చాల బహుమతి లభింపగలదు.

మోక్ష:— చేతనైనచో నభ్యంతరములేదు. అదేమి ?

పరితాపుడు మోక్షదాను దగ్గిర కూర్చుండబెట్టి జరుపవలసిన కర్తవ్యమును బోధించి యిట్లనియె. నీ వెళ్లిన నామెను నాకు స్వాధీనము జేయవలయును. అట్లు చేసితివా నీకు చాల లాభము కలుగును. ముందీ యిరువదిరూపాయలను దీసికొనిపొమ్ము. అవసరమైన ఖర్చున కుపయోగపడును.

మోక్ష:— బాబూ ! నాకు మీరింతగ చెప్పవలయునా ? ఒక్క వారము దినములలో మీ కామెను స్వాధీనము జేసెదను. వెనుక ముఖర్జీబాబుగారింట్లో నున్న వినోదిని గొనివచ్చి మీకు స్వాధీనము చేయలేదా ? ఇది అంతకన్న గొప్పది కాదు.

అని చెప్పుచు నిరువది రూపాయలు తీసుకొనెను.

ప్రతా:— దానికిని దీనికిని భేదమున్నది. వినోదిని పేదయింటి విత తువు. ఈమె యొక్క గొప్ప యింటిసువాసిని. మగవాలు అందువలన జాగ్రత్తతో పని చేయవలయును.

మోక్ష:— ఏమియును భయములేదు. నా నేర్పరితన మెట్టిదో ఈమారు చూడగలరు.

ప్రతా:— నీకు లభించు బహుమతి యెట్టిదో గ్రహింపగలవు.

---

పదునేడవ ప్రకరణము.

—:o:—

## వధూసందర్శనము.

గంగారాము-ననీలాలు-వీరిద్దరును ప్యారీలాలుతో మంత నములాడి యాతనికి చక్కని పిల్లను దెచ్చి పెండ్లి చేయుదుమని యాన పెట్టి యాతని మేనత్తను గోపాలచంద్రునియింట వంటజేయు టకును మోక్షదాను కార్యసహాయమునకు రాలుగను నేర్పాటుచేసి రమ్మని బలవంతపరచిరి. యేదియో యొకవిధముగ పెండ్లిచేసుకొని నచో సంతానము కలుగును. సంతతిగల్గినచో తండ్రితాతలు పిండ ప్రదానములనంది తరింతురను నాశతో ప్యారీలాలు అందుల కంగీ కరించెను. గోపాలచంద్రునకిందువలన గలుగబోవు లాభనష్టము లను గురించి యాలోచించవలసిన యవసరము లేకపోయినది. ఒక దినమున వారిర్వురను వెంటబెట్టుకొని గోపాలబాబు యింటికేగి యప్పగించి వచ్చెను. గోపాలబాబు ప్యారీలాలును వైద్యసందర్భ మున చిరకాలమునుండి నెరింగియున్నవా డగుటచే నతని మాటను విశ్వసించి వారిర్వురను తనయింట నుంచెను.

మరునాడు ననీలాలు-గంగారాము లిద్దరు ప్యారీలాలు గృహమున కేగిరి. వైద్యమహాశయుడు మొదులగదిలో గూర్చుండి వారి నిద్దరను జూచి రమ్మనిపిలిచెను. ఇద్దరును బల్లపై గూర్చుండిరి.

గంగా:—అయ్యా ! వైద్యరాజుగారూ ! మేముచెప్పినపని పూర్తి గావించితిరా ?

ప్యారీ:—నిన్ననే పూర్తిచేసితిని. మా ముసలి మేనత్త వంటచేయుటకును మోక్షదా కార్య సహాయకురాలుగను నియమించితిని. మీపని మీకు పూర్తియైనది. నా వివాహమునుగూర్చి ప్రయత్నింపవలయును.

ననీ:—అందుల కేమియును సందేహములేదు. మే మేమాటను చెప్పెదమో దానిని చేసితీరెదము. మా కసాధ్య మేమియును లేదు. మీ రీ రహస్య మెవ్వరితోడను చెప్పగూడదు. చెప్పితిరా కార్యమంతయుఁ జెడిపోవును.

ప్యారీ:—నేనంత మతిలేనివాడనుగాను. పదిమందికి తెలిసినయెడల నా వివాహమున కాటంకము కలుగును. మీరుమాత్రము నా వివాహకార్యమును శీఘ్రముగ నెఱవేర్చుడు నీ కింత తొందరయేల నని యడిగెదరేమో నాతో నీ వంశ మంతరించును. పితృదేవతలకు పిండప్రదానమునకు వేరాధారమే మున్నది ? ఒక్కపిల్లవాని నేదో యొకవిధముగ సంపాదించిన నింతచిక్కుండదు. అందులకై యింత పరితపించుచున్నాను. ఇంతకు పిల్ల కుదిరినదా ? ఒకమాటు నాకు జూపెదరా ?

గంగా:—మా మాటలయందు నమ్మకములేకున్న మాతో రండు చూపించెదము. ననీలాల్ ! వైద్యమహాశయులకు పిల్లను జూపించి వత్తము రమ్ము.

ముగ్గురు బయలుదేరిరి. సరోజని యను పేరుగల ప్రతాపుని యుంపుడుకత్తెయింటికి గొంపోయిరి. ఆమె వయస్సు పదునెన్మిది వత్సరములు. నిండుయవ్వనమున విలసిల్లుసుందరి. సుమారు మూడు సంవత్సరములక్రింద నామెను మోసపుచ్చి స్వగృహమునుండి తీసుకొనివచ్చెను. యవ్వనదశామాహాత్మ్యమున జనించు కోర్కెల నరికట్టలేక ప్రతాపచంద్రుని మోసపుమాటలను నమ్మి గృహత్యాగమొనర్చెను. వ్యభిచారియగువాడు తనజీవితము నెల్లనొక్క స్త్రీతో గడుపజాలడు. అట్లే ప్రతాపుడు కొలదికాల మామెతో సుఖించెను. ఇంతలో నా భ్రమరమునకు వేరొక పుష్పము నాఘ్రాణింప మనస్సుపోవుటచే సరోజనిప్రియ పరిత్యక్తమయ్యెను.

గంగా:—రండు. బాబుగారుకూడ సమయమునకు లోపలనేవున్నారు.

ప్రతా:—రండి దయచేయుండి. కుర్చీలో కూర్చుండుడు.

గంగా:—బాబూ! వీరేనండి ప్యారీలాలు వైద్యమహాశయులు. మంచివారు-గొప్ప కులీనులు-ఈ శ్రీశ బెనర్జీగారి పుత్రులు-సీతారామ బెనర్జీగారి మనుమలు.

నసీ:—బాగుగా చదువుకొనినవారు. వైద్యమందు నిధి. భిషగ్రత్న అనే బిరుదుకలదు. అనేకమంది ప్రతిదినము వీరివైద్యశాలకు వచ్చి చికిత్సను పొందుచుందురు.

ప్రతా:—ఇంతయును బాగుగనేయున్నది. కాని వయస్సు మీరినది.

గంగా:—దానికా చింతయక్కరలేదు. నలుబది-ఏబది వత్సరముల వయస్సుకన్న నెక్కువయుండదు. అట్టివారు రెండవపెండ్లి చేసికొనుటలేదా? మధ్య వయస్సు దాటుచున్ననేమి? సంసారమున ననుభవము కలవారు. భార్యనెట్లు సంతుష్టి పరచవలయునో యావిధములను బాగుగా నెఱింగినవారు.

ఇదివరకలో రెండు పెండ్లిండ్లు పూర్తియైనవి. ఇది మూడవ వివాహ ప్రయత్నము.

ప్రతా:—మహాశయా! మీా కిప్పుడు వివాహము చేసికొనవలయు నను తలంపేల గలిగినది? అనుభవించిన సుఖము చాలదా?

ప్యారీ:—నే నిప్పుడు వివాహమాడదలంచుట సుఖాపేక్షచే కాదు. ధర్మాపేక్షచేత నని యెఱుంగుడు. నేను సంతాన విహీనుడ నయినచో స్వర్గస్థులైన నా పితరులకు సద్గతులుండవు. పితృ దేవతలకు శాశ్వత పిండ ప్రదానము జరుగుచుండ వలయు నను తలాపుతో వివాహమాడ దలంచితిని

గంగా:—బాబూజీ! మీా రెట్లైన నీ శుభ కార్యమును సమకూర్పక తప్పదు. మీా పై ఆధారపడియున్నది

ప్రతా:—మంచిది. అట్లయినచో నాలస్యమేల? మంచి లగ్నమును జూడవలయును. కన్య వయస్సు మీారినది. అభ్యంతర మేమైన కలదా?

నసీ:—ఏమియు నాటంకములేదు. వారికట్టికన్యయే కావలయును. ప్రస్తుతము వైద్యమహాశయులు తమకు కాబోవు భార్యను చూడదలంచి వచ్చియున్నారు.

ప్రతా:—అట్లనా! మీా రిచ్చటనే గూర్చుండుడు. నే నిప్పుడే వచ్చెదను. ప్రతాపచంద్రుడు లోనికేగెను. ప్యారీలాలు నలుప్రక్కలజూచుచు దాని యందము నకు మెచ్చుకొనెను.

ప్యారీ:—ఈ యింటి యందము బట్టి యజమాని గొప్ప ధనికుడు అని తోచుచున్నది. ఇంత గొప్పవారితో మీాకు పరిచయ మెట్లు కలిగినది?

నసీ:—మాకు తెల్లవారితే పనియంతయు నట్టి ధనికుల తోడనే యుండును. ధనాఢ్యవ్యక్తులను వదలి మీావంటి గంజాయి దమ్ముగారిని నమ్ముకొనిన మాకేమి లాభము.

గంగా:—మాట్లాడకుము. బాబుగారుపిల్లను వెంటబెట్టుకొని వచ్చుచుందురు

ప్యారీ:—పిల్లవచ్చుచున్నదా ? ఏదీ ! ఎచ్చట ?

నలువైపుల జూచుచుండ నసీలాలు పట్టుకొని కూర్చుండబెట్టెను.

నసీ:—తొందరపడకుము. ఎక్కడికి బోలేదు నవ్వెదరు. ఎదుటికివచ్చి నప్పుడు చూడవచ్చును.

ప్రతాపచంద్రుడు సరోజినిని సమీపించి పికారునకు పోవుదము రమ్మని మరపించి చేయిపట్టుకొని వెలుపలికి దీసుకొనివచ్చి మహాశయా ! చూడుము ఈమెయే కన్య.

ప్యారీలాలు తటాలున లేచి సరోజినిని సమీపించి యామెను పాదాదికేశపర్యంతము జూచి సౌందర్యమునకు ముగ్ధుడై మహానందభరితుడయ్యెను.

ప్యారీ:—పిల్ల మిగుల సౌందర్యవతి. చూడనక్కరలేదు. నేను సిద్ధముగ నుంటిని. మీరు శుభదినమును విచారింపుడు.

సరోజని ప్యారీలాలు మాటలనువిని ప్రతాపునిజూచి మహాకోపముతో చరచర లోనికేగెను. ప్రతాపచంద్రుడు చిరునవ్వు నవ్వెను.

గంగా:—వైద్య మహాశయా ! మీ పనియైనది. మీరు దయచేయుడు. మంచిదినమును విచారించి వార్తనంపెదము.

ప్రతా:—పెద్దమనుష్యుల నూరకపంపుట మర్యాదకాదు. మహాశయా ! మాయింట నీపూట భుజించి పొండు.

ప్రతాపుడులేచి ప్యారీలాలు చేయిపట్టుకొని లోనికి గొంపోయెను.

———

పదిననిమిదవ ప్రకరణము.

——:o:——

# సంశయబీజము.

నేటికి మూడు నెలలనుండి గోపాలచంద్రుని యింటిలో ప్యారీలాలు మేనత్త వంటచేయుచుండెను మోక్షదా ఇల్లునర్దుట సామానులను పరిశుభ్రము చేయుట-మోహినికి తలదువ్వుట శృంగారము చేయుట మొదలగు కార్యములచే మోహినిహృదయము నాకర్షించెను. మోక్షదా వచించు మృదుమధుర సంభాషణములచే కార్యక్రమమున కెంతయు మోహిని సంతసించెను. సంసారము నడచుట కెట్టి యాటంకములు లేవని యానందించెను. తోడికోడలు కమలప్రియా మొకమితమైన యీర్ష్యయగుటచే నిరంతరము దూషించుచుండును. స్వర్ణమణి మొదలగు వితంతువులందరు కమలను ప్రేమింతురను కోపముచే వారినిగూడ నిందించుచుండును. వారితో పోట్లాడి రమ్మని మోక్షదాను ప్రోత్సహించుచుండును.

మోక్షదా మోహినిని పూర్తిగ వశముజేసికొని తోడికోడండ్లలోను-అన్నదమ్ములలోను జగడములను వృద్ధిజేసి మోహినిని నిస్సహాయునిగా జేయదలంచి సమయమున కెదురు చూచుచుండెను. ఒకనాడు గంగారాముని ప్రోత్సాహమున మోక్షదా కమల యొక్క రూపురేఖా విలాసముల జూడవలయునని తలంచి వారింటికిబోయెను. స్వర్ణమణి దీనివైఖరిని గమనించి మూలనున్న చీపురుకట్ట చేతగొని యిట్లనియె. మోక్షదా ! ఇంకొకమారీ వైపునకు వచ్చితివేని నీవు తట్టుదేర వాయగొట్టెదను జాగ్రత్త. నీ పనికిమాలిన యాటలిక్కడ సాగవు.

ఆ మాటలతో మోక్షదా తిరిగి యథాస్థానమును జేరెను. ఇటువైపు కన్నెత్తిచూడలేదు. గోపాలచంద్రుడు గోవిందునివలన కచేరీలోని సంగతులను విని సిగ్గుపడి ఆఫీసునకు పోవ మానివేసెను. గోవిందుడు కచ్చేరీలో తనపనియు సోదరునిపని గూడ జూచుచు డైరక్టరుగారితో మనవిచేసి మూడుమాసముల వరకు జీతనష్టము లేకుండ సెలవు ఇప్పింపవలయునని వేడుకొనెను. ముందే గోవిందుని కార్యదీక్షతను గమనించి సోదరుని పనిని గూడ పూర్తిచేయుచున్నందుల కానందించి గోవిందుడు కోరినట్లు సెలవు మంజూరు చేయించెను. అతని భాతృభక్తికెంతయు సంతసించెను. గోపాలున కిప్పుడేమియు పనిలేదు. ఇంటగూర్చుండుట-సారాయి త్రాగుట-ఇంతకన్న వేరు కార్యక్రమములేదు. మోహిని కొన్నదినములు చూచియు చూడనట్లూరకుండెను. గాని నానాటికి నతని త్రాగుడు హద్దుమీరుచుండుటచే మందలించియు. కోపపడియు చూచెను కాని లాభములేకపోవుటచే సారాయిసీసాలను కనబడకుండ దాచుట కారంభించెను. గోపాలుడామెను సంశయించుచుండెను. ఒకనాడు గోపాలుడు బైటకి పోయివచ్చి త్రాగుటకై అలమారా తీయ బుడ్డిలేదు. భార్యపై మిక్కిలి కోపమువచ్చెను నిందించెను.

గోపా:— మోహినీ! మరల సీసానుదీసి దాచితివా? ఇటు తెమ్ము. కొంచెము త్రాగనిమ్ము.

మోహి:— వీలులేదు నానాటికి మీస్థితి హద్దుమీరుచున్నది ఇంటిలోని డబ్బంతయు నాశనమగుచున్నది. పిల్లలకు శరీరమున నొక మంచివస్త్రమైన లేదు. ఇంటిలోని కేమికావలయునో యను చింతలేదు దివారాత్రములు సారాయి. సారాయి. ఇప్పుడేకదా త్రాగితిరి.

గోపా:— నాకీ మాటలు పనికిరావు. సీసా ఇచ్చెదవా లేదా?

మోహి:— చేయిజారి క్రిందబడి పగిలినది

గోపా:— రెండు రూపాయలిచ్చి మోక్షదాను షాపునకు బంపి క్రొత్తబుడ్డిని తెప్పింపుము.

మోహి:— మోక్షదా యింటిలో లేదు. పైగా డబ్బు పైసయైన లేదు. ఆఫీసు-ఉద్యోగము వదలి రాత్రింబగళ్ళు త్రాగుచు కూర్చుండిన నల్వురు నవ్వుచున్నారను నభిమానములేదా ?

గోపా:— మోహినీ ! అభిమానమును విసర్జించితిని. కావలయుననియే త్రాగుచుంటిని. నాకీ దశయంతయు వచ్చుటకు కారకురాలవు నీవుగావా ? నీవ్రేర్చిన దుస్సలహాలకు చెవియొగ్గి పనిచేయుటవలన నేటికి నాకీ దురవస్థ సంభవించినది. నీ యాలోచనమువలన లక్ష్మీస్వరూపిణియైన పుత్రికా సమానురాలయిన కమలను- ధర్మచారిణియై పరమభక్తుడైన సోదరుని బాల్యమునుండి నన్ను పెంచిన- నా కుటుంబమునత్యాదరబుద్ధితో విమర్శించుచున్న స్వర్ణమణి—పద్మమణి— మొదలగు వితంతువులను చేరుచేసి వెడలగొట్టితిని. నారేగుడు నా యింటినుండి యావలకుబోయినో యదిమొదలు నాకు దుర్దినములు ప్రారంభమైనవి. నాకు కన్నులు పొరయుగ్రమ్ముటచే నప్పుడు గ్రహింపలేక పోయితిని. ఆ పాపమంతయు నీ సురాపానరూపముగ నన్ను కట్టికుడుపుచున్నది నీ వింటికి యజమానురాలవగుటకు ప్రథమఫలితమేమనగా నేను త్రాగుబోతునగుట నౌకరీ పోగొట్టుకొనుటయే. యే సోదరుని నే నన్యాయముగ నొక్కరూక్యమైన నీయక వెడలగొట్టితినో యా గోవిందుడే పోవలసిన నౌకరిని నిలువబెట్టి నా పని గూడ తానుజేయుచు నన్నింటికడ గూర్చుండబెట్టి నిండు జీతముపై సెలవు మంజూరు చేయుంచినాడు. అట్టి పరమ భక్తుని వెడలగొట్టిన పాపమూరక పోవునా ? మోహినీ ! చెప్పుము. ఈ దుర్దశకు కారణము నీ యాలోచనయా ? నా

చేతనా? నాహృదయము దహించుకొని పోవుచున్నది. తెమ్ము సారాయి సీసాను.

అనిపల్కుచు గోపాలుడు మోహిని చేయిపట్టుకొనెను. ఇనిమిటి మాటలువిని మోహిని మహాగ్రహముతో చేతిని విదలించుకొని దూరముగ నిలువబడి యున్నామె. ఏమి? తమ్ముపక్క మరదలిపైయంత ప్రేమయున్నచో మరదలు దగ్గర నుండవచ్చును. నాతో నేమిపని?

గోపాలచంద్రునకు క్రోధము ద్విగుణమగుటచే భార్యను జూచి రానురాను గృహమునకు యజమానురాల వగుటచేతనా? నోరుపెద్దదియగుచున్నది......అనిపల్కుచు భార్యనొక్క తన్ను తన్ని యటనుండి వెడలిపోయెను.

మోహిని యింతవరకు పతివలన దూషణముగాని దండింపబడుటగాని యెరుంగదు. అత్తమామలు లున్నప్పుడుకూడ మోహినిని పెద్దకోడలని గౌరవించెడివారు. అట్టి మోహిని యిప్పుడు పతిచే పాదతాడిత యగుటచే క్రోధము-రోషము-దుఃఖము నొక్కమారుగ గలిగెను. కన్నీరుగార్చెను. తలపోసెను.

ఆహా! సమిష్టికుటుంబమునుండి వేరుపడినందులకు ఫలమిదియా? సంపాదనలో పదిరూప్యములు నిలువజేసికొనుటకై చేసిన పని యంతయు నీరీతిగ పరిణమించినదా? చేతగాక నుద్యోగమును పోగొట్టుకొని త్రాగుటకలవాటగుట నా నేరమా? ఎంతదురవస్థ! వేరుపడినందులకు సుఖములేకపోగా తుదకు నాకీ తోడికోడలు బాధ తప్పినదికాదు. లక్ష్మీస్వరూపిణియట- పుత్రికా సమానురాలట యెంత యభిమానము? పిల్లలో-గోజులో మూడువంతుల కాలము పిన్ని పిన్ని యనుచు దానియింటికే జేరుచుందురు. చివరకు నా సం

సారసౌఖ్యమునకు కమల నాశకురాలై పరిణమించినది. దీనిని నాశనము జేయు టెట్లు ?

ఇట్లు తలపోయుచుండ సమయమునుగనిపెట్టి మోక్షదా వీధిలో నుండిన మోహిని సమీపమునకు జేరెను.

మోక్ష:—అమ్మా ! బాబుగారినిప్పుడు వీధులో చూచితిని దుకాణముపై గూర్చుండి తాగుచున్నారు. ఇంటికి రాలేదా ?

మోహి:—ఇంతకుముందే ఇంటికివచ్చి సారాసీసా నడిగినారు నేను దానిని కనపడకుండ దాచి పగిలినదని బొంకితిని. అందుచే కోపమువచ్చి తన నౌకరిని వెనుకవైచుకొనివచ్చి నన్ను తిట్టి బలముకొలది తన్ని పోయెను. ఇంటిలోనేమియున్నదో లేదో యను చింత లేదు. రాత్రింబవళ్ళు త్రాగుటయు-వలదన్న కొట్టుటప్రారంభించినారు. ఇంకను నొప్పి పోలేదు.

ఇట్టి తరుణమును పోగొట్టకూడదని తలంచి మోక్షదా తన పంచాంగమును విప్పెను.

మోహి:—అమ్మా ! త్రాగుడు ప్రారంభించిన తరువాత గొంపగుల్ల శరీరముగుల్లయే. ఇంతియేకాదు. నీకు మరియొక రహస్యము తెలియును. చెప్పిన నీవు విచారపడెదవని యూరకుంటిని. ప్రసంగము వచ్చుటచే చెప్పుచుంటిని. అయన ప్రతిదినమొక వేశ్యాగృహమున కేగుచున్నాడు. అదియొక కురూపిణి. పురుషుల కిదియొక దుర్గుణము. ఇంట రంభను ధిక్కరించు భార్య యున్నను సరియే-పనికిమాలిన వేశ్యా సాంగత్యమున కాశింతురు. ఇందులకు మీవారే తార్కాణము. నీవంటి జగన్మోహిని యింటనుండ సుఖపెట్టజాలక తిట్టి కొట్టి యాముండను జేరుచుండ నింకేమనవలయును ?

మోహి:—నీ కీసంగతి యెట్లు తెలిసినది.

మోక్ష:—నేను స్వయముగ గాంచితిని. ఒకనాడు సారానీసాతో నా యింటికేగుచుండ నా నిమునరావును కలిగి ప్రతిదినమును పరీక్షించితిని. నిశ్చయము తెలిసినది. బాబుగారా వేశ్య నుంచినట్లు తెలిసికొంటిని. రామ రామ.

మోహి:—పోనిమ్ము. నేనేమి చేయగలను. ఇంటికి యజమానురాలనై పది రూప్యముల నిలువ జేసికొని సుఖపడుద మని తలంచి చెవిలో నూరిపోసి నిర్వ్యాప్రయత్నమున వేసుపడితిమి. దానిఫలితమిట్లు పరిణమించినది. చివరకు పిల్లలుకూడ నన్ను వదలి దానినే పట్టుకొని వ్రేలాడుచున్నారు.

మోక్ష:—పిల్లలదేమున్నది? ఎవరు చనువుజేసిన వారి యండజేరుదురు. దానికేమిగాని నీవింత నడియవ్వనములో నిట్లు తన్నులు తినుచు జీవితమును గడుపుటయేలా?

మోహి:—(కన్నీరు తుడుచుకొనుచు) ఏమిచేయగలను. పురుషులు స్వతంత్రులు. వారేమిచేసినను చేయగలరు. ఆడుదానను నే నేమిచేయగలను.

మోక్ష:—తలచుకొనిన నేమినైన చేయవచ్చును. నాభర్తయే యిట్లు చేసినచో చీపురుకట్టతో వానికి బుద్ధిచెప్పి వేరొక భర్తను చేసికొనుదాననే.

మోహి:—అదెట్లు సాధ్యమగును? కావలయునన్నను సిద్ధముగ నున్నవా రెవరు?

మోక్ష:—కావలసినంతమంది నీవు చెప్పినయెడల నవమన్మథాకారుడైన ధనాఢ్యవ్యక్తిని వెదకి తీసుకొని రాగలను.

మోహి:—మోక్షదా! నామనస్తాపమునకు మూలకారణ మా దుర్మార్గురాలు కమల. దాని నెట్లైన సాధ్యపరచుకొని మరి యొకని కంట గట్టుము. నీకు మిక్కిలి బహుమాన మిచ్చెదను.

మోక్ష:—ఆ నిమాత్రము నావలన కానేరదు అయినాట కాలు పెట్టితినా అచ్చటి వితంతువులందరును కాట్లకుక్కలవలె మీద పడుదురు. ఒకమారు చూతమని వెళ్లితిని. ఎవరో స్వర్ణమణియట చీపురుకట్ట తీసుకొని కొట్టవచ్చినది.

మోహి:—అంత సాహసమా! నీ వేమిచేసితివి?

మోక్ష—ఏమిచేయగలను పాఱిపోయివచ్చితిని. మరియొకమారు విందులకు ప్రతిక్రియ జేసి కసి తీర్చుకొనెదను. కాని నీ క్షేమమును గోరి నేనొక మాటను చెప్పెద వినుము. ఈ తాగుబోతు పెనిమిటివలన గలుగు బాధను తప్పించుకొను మార్గము చూచుకొనుము. నాడు గంగాతీరమున రూపనగర యువరాజు నిన్ను చూచి ఆశ్చర్యపడి ఇట్టి భార్య నాకు లభించిన చో నెత్తినిబెట్టుకొని పూజించియుందునని చెప్పినాడట. సుఖపడలేక యిట్టి బాధలు పడుటకు నీ కర్మమేమి?

మోహి:— నన్నెప్పుడు చూచినాడు?

మోక్ష:—గ్రహణస్నానము చేయుబోయిననాడు నిన్ను జూచెను. నేను వెనుక కొంతకాలము జమీందారుగారింట్లో పని చేసితిని. తత్కారణమున నన్ను గుర్తింపగలిగెను.

మోహి:—ఇంకమీద గ్రహణస్నానమునకు బోవుటయే తప్పుగా దోచుచున్నది. అనేకమంది వచ్చుచుందురు. ఎవరిహృదయమున నేతలంపులుండునో తెలుసుకొనుట కష్టము.

మోక్ష:—ఉండనిమ్ము. అందువలన మనకేమియు నష్టములేదు. నేను యథార్థమును చెప్పుచున్నాను అతని పేరు ప్రతాపచంద్రరాయి. రూపమునకు మన్మథుడు. ధనమునకు కుబేరుడు. ఈవికి కర్ణుడు. ప్రథమ భార్య చనిపోయినది మొదలు తగిన భార్య దొరకక పెండ్లిచేసికొనలేదు నిశ్చయముగ

పదునెనిమిదవ ప్రకరణము.

నీవే నద్ప్రవేశమున నతనికి పత్నివి కాకపోతివి. నీ శరీరము నకు బంగారుతొడుగు చేయించియుండును. ఇప్పటికైనను మించినదిలేదు. ఆలోచించుకొనుము నీ భర్తకు నీపై నేమియు ప్రేమలేదు. సారాయిసీసా చేతబట్టుకొని ఎల్లప్పుడు బోమరుకస్పనతె నున్న యా రండతో కాలము గడుపు చున్నాడు. నీ కర్మమింక సుఖము లేకపోగా కాలిబూటు దెబ్బలే గతి. ఇదివర కొక్కడే తాగెడువాడు ఇప్పుడిద్దరు తాగుచుండుటచే నీ విద్య డబ్బాతము బూడిదలో పను చున్నది.

మోక్షదాయొక్క వాక్చాతుర్యమువలన మోహిని తన యారాధ్యదేవత యగు గోపాలచంద్రుని యెడల సంశయచిత్త యయ్యెను. మోక్షదా చెప్పిన విషయమంతయు నిజమని నమ్మెను. తాత్కాలికముగ భర్తపై విరక్తిగలైను. సంశయాకులితమనస్కయై యిట్లనియె.

మోహి:— మోక్షదా నీయభిప్రాయమేమో నాకుస్పష్టపడుటలేదు వివరింపుము.

మోక్ష— ఏమియును లేదు. సౌందర్యనిధివై ప్రేమస్వరూపిణివైన నిన్ను పాదములతో దన్నిన తాగుబోతు భర్తనుండి విడివడి ప్రతాపచంద్రబాబును బోలిన జమీందారుని చెట్టపట్టి సుఖంపుమంటిని.

మోహి:— అదెట్లు సాధ్యపడును!

తన యుపన్యాసమంతయు సార్థకమయ్యె నని తలంచి మోక్షదా చిరునవ్వు నవ్వుచు నిట్లనియె.

మోక్ష:— సాధ్యమగునట్లు నేను చేయగలను. జన్మమెత్తినందులకు అట్టి సౌఖ్యము- అంతజనాహిరీ- అంత ఎస్టేటు-నీపాదముల

దగ్గరకు వచ్చుచుండ- స్వర్గసౌఖ్యముకోరి వరింపనుండ దాని ననుభవింపని జన్మమేల? నీ భర్తవలన నీ కెంతమాత్రము భయములేదు. ఒక్కమారు నీకాబాబుగారితోటలు మేడలు అందలి చిత్రములు చూపించి తీసుకొనివచ్చెదను. నీ భర్త కనుమానము కలుగకుండ నాదినమున నతనిని పూర్తిగ త్రాగింపుము. వలదన్నను బలవంతపరచి త్రాగింపుము. మత్తుతో పడియుండును. లేదా ఆవేశ్య యింటికేగును. తిరిగి వచ్చులోపల మనపని పూర్తిచేసికొని రావచ్చును. పోనిమ్ము ఆపని నీవలన కాకున్న నే నాతని రాకను నిరోధించెదను. నీ సౌభాగ్యదశను కోరి చెప్పుచుంటిని.

మోక్షదా యుపన్యాసమునకు మోహిని చకితయయ్యెను. ఆమెయొక్క మనస్సంతయు మోక్షదాకు స్వాధీనమగుటచే యొక్కింతకాలము తన స్థితిని తన సంగతిని తాను మరచిపోయెను. మోక్షదా తనపై నింతప్రేమయేల చూపించుచున్నదో తన కిట్టి యుపదేశమేల నొసంగుచున్నదో గ్రహించుకొనలేకపోయెను. ఆమె యొక్క మెత్తదనము గ్రహించి మోక్షదా బలాత్కరింపసాగెను. గృహమునకు మోహిని యజమానురాలు సలహాచెప్పునది-మోక్షదా. మంచిచెడ్డలను విమర్శించి చెప్పు పెద్దదిక్కులేదు. ఇంక పాచిక పారుటకు సందియమేమి?

దుర్బలహృదయుడైన గోపాలచంద్రు డేనాడు భార్యమాటలకు చెవియొగ్గి యందరిని వేరుపరచి కుటుంబమునకు పెద్దదిక్కు లేకుండ జేసికొని మోక్షదావంటి కులటను ఇంట నిల్పుకొనెనో యానాడు మొదలుకొని యాతని సంకల్పవృక్షమునకు విషఫలములు బయలుదేరుటకు ప్రారంభమయ్యెను. ఇదియే సమిష్టినుండి విడబడి వేరింటికాపురము పెట్టినందులకు మొదటి దశ.

---

---:o:---

# వివాహప్రసంగము.

ప్యారీలాలు వివాహాపేక్షతో నున్మత్తుడై పోయెను. సనీలాలు గంగారాము లిద్దరును వానికి వివాహము జేయుదుమని నమ్మించి యా ముసలిని తమ చేతిలోని కీలుబొమ్మను జేసికొనిరి. అతడును వారెట్లాడుమనిన నట్లాడుచుండెను. ప్రతాపచంద్రుని యుంపుడుకత్తెయగు సరోజనిని చూపి యీ తార్పుబోతు లిద్దరు ప్యారీలాలు దగ్గర ధనమును కాజేసి సారాదిపోతులో భద్రము జేయుచుండిరి. ఒకనాడు వారిద్దరకు ధనము కావలసి వచ్చెను. ప్యారీలాలు దగ్గర సంగ్రహింపవలయునని తలంచి బయలుదేరి వచ్చిరి. ప్యారీలాలు వైద్యశాలలో గూర్చుండి వీరిరాకకెదురు చూచుచుండెను. సనీలాలు గంగారాము లిద్దరునువచ్చి ప్యారీలాలున కిరుప్రక్కల గూర్చుండి సంభాషణమున కుపక్రమించిరి. సంధ్యాకాలము వసంతఋతువగుటచే చల్లనిగాలి వీచుచుండెను. పశువత్సాదులు తమస్థానములకు జేరుచుండెను. పరభృతములు తరుశాఖలపై గూర్చుండి కోమల చూత కిసలయములను భక్షించి తమతమ కుహూకుహూస్వనములచే దిశలను ప్రతిధ్వనింప జేయుచుండెను.

ఇట్టి సమయమున మోక్షదా యట కరుదెంచెను. గంగారాము డామెను జూచి చిరునవ్వు నవ్వుచు నిట్లనియె.

గంగా:—ముఖము వికసించియున్నది ఏమైన విశేషములున్నవా? సత్వర మెఱింగింపుము.

మోక్షదా యానిమాటకు ప్రత్యుత్తరమీయక విరహవేదనముతో గూడుకొనిన ప్రేమగానము నాలాపించుచుండెను. ఆ గానమాధురికి జొక్కి వీరు ముగ్గురు తలలు త్రిప్పుచుండిరి.

మోక్షదా మంచిగాయని. ఆమె తన పూర్ణయవ్వనావస్థలో గృహపరిత్యాగ మొనర్చి యొకధనికుని యొండజేరి గానము నభ్యసించినది. విద్యుల్లతవలె మెఱయుచున్న యామె యవ్వనము కొంతకాలమునకు విద్యుల్లతవలెనే యామె శరీరమునుండి యంతర్ధానమయ్యెను. చేరదీసిన యా ధనికుడామె శరీరమందలి యవ్వనమధువునంతయుం దృప్తితీర పూర్తిగ ననుభవించి మకరందపానము పూర్తియైనపిదప భ్రమరము కుసుమము నెట్లు వదలునో యట్లే యా ధనికుడు మోక్షదాను పరిత్యజించెను. జనాకర్షణీయమైన యా ప్రకాశమామె శరీరమునుండి మాయమగుటచే నితరులెవ్వరు నంతగా సమీపించకుండుటచే నిప్పుడీవిధముగ గాలక్షేపముం జేయుచుండెను.

మోక్షదా తానుపాడుచున్న గానము నాపివైచి సంభాషణమున కుపక్రమించెను.

మోక్ష:—గంగారాం ! నా పాటవలన మీకు కోపమువచ్చినదా ?

గంగా:— కోపమా ! నా బహిఃప్రాణముమైన నీపై కోపమా ? అట్టిమాట నెన్నడు ననకుము. నీవు వెళ్ళిన పని యేమైనది ?

మోక్ష:—ఒక ప్రకారముగా మార్గములోనికి వచ్చినవి ? కాని విపరీతమైన కష్టము పడవలసి వచ్చినది.

గంగా:—సుందరీ ! నీ శక్తి కసాధ్యమేమున్నది ? నీవు మాపాలిట సిద్ధేశ్వరివి. చెప్పుము ఇప్పుడేమి చేయవలయును.

మోక్ష:—అతికష్టమున నామె నంగీకరింప జేసితిని. రెండు మూడు విలువగల నగలనుగూడ సంగ్రహించితిని. ఇప్పుడామె నా చేతిలోని కీలుబొమ్మ. రేపు సాయంకాల మామెను తోట

లోనికి గొనివచ్చెదను. మీ రా సహాయమున గోపాలబాబు నాటంకపరచి యుంచవలయును. అతడింటికి జేరినా? సర్వము నాశనమగును. చేసిన ఖర్చు-పడిన కష్టము వ్యర్థమగును. నేనీ సంగతిని మీ కెరిగింపవచ్చితిని.

గంగా:—మీ మాటను పట్టియుంచెదను. అతడిప్పుడు నాకు పరమమిత్రుడు. నా మాటను జవదాటడు.

మోక్ష:—సరియే నేను వెళ్ళెదను. ప్రతాపబాబుకీ వార్త నెరింగించి తగిన బహుమతిని సంపాదింపవలయును.

మోక్షదా వెడలిపోయిన పిదప వారు ముివ్వురును సంభాషణమున కుపక్రమించిరి.

ప్యారీ:—గంగారాం! వివాహమునకు శుభలగ్న మెప్పుడు నిర్ణయించితివి? కాలహరణము మంచిదికాదు. "శుభస్య శీఘ్రం అశుభస్య కాలహరణం" అన్నారు పెద్దలు. ఎంత సత్వరముగ వివాహము జరిగిన నంతమంచిది. పితృదేవతలకు పిండప్రదానము శాస్త్రోక్తముగా జరుగును.

గంగా:—నే నంతయు స్థిరపరచితిని గాని యామెకిప్పుడు రెండు వందల రూపాయలు జరుగురుగ కావలసి వచ్చినది. అది సర్దుబాటు చేసిన గాని వివాహమున కామె యంగీకరింపదు. కారణమేమనగా? ఆమెయొక్క యొడలిపైనున్న నగలు నీకు వరదక్షిణక్రింద రాగలవు. కాని యామెకు స్వంతఖర్చు నిమిత్తము రెండువందల రూపాయలిప్పుడు కావలయునట-ఆమె సోదరుడు చెప్పినాడు. పట్టుదలగా నున్నది.

ప్యారీ:—చాల చెడ్డపట్టుదల. రెండుపెండిండ్లు చేసికొంటినిగాని ఇట్లు ముందుగనే డబ్బుతెమ్మని బలవంతమును వారు చేయలేదు. కొమరుడ నైనందులకు తండ్రితాతలకు శాశ్వత పిండప్రదా

నము జరుపుట ధర్మము. దానివలన వంశములు తరించునని శాస్త్రములు చెప్పుచున్నవి. వినుము—

శ్లో॥ శమీపత్ర ప్రమాణేన పిండం దద్యాద్గయాశ్శిరే॥
ఉద్ధరేత్సప్త గోత్రాణి కులమే కోత్తరం శతం॥

అన్నారు శాస్త్రకారులు. అందుకొరకు వివాహము చేసుకొన దలంచితిని గాని లేకున్న నాకిప్పుడు పెండ్లి యేల ?

గంగా:—ఆ పెండ్లికిని ఈ పెండ్లికిని భేదమున్నది. నీ వప్పుడు పడుచువాడవు. సుందరుడవు. యిప్పుడు ముదుసలివి అందువలన ఆవల పెండ్లికుమార్తె ఉద్దేశ్యములకు కాలానుసారముగ తలను వంచవలయును.

ప్యారీ:—సరియే నీమాట కాదననేల ? ప్రస్తుతము నావద్ద నేబది రూపాయలున్నవి. వానిని తీసుకొనిపోయి యీమొకిమ్ము. మిగిలినవి రెండు మూడు దినములలో సర్దుబాటు చేసెదను. శీఘ్రముగ వివాహమును జరుపుము. చూచితిరా ! పితృదేవతలకు పిండప్రదాన వాంఛనాచేనిట్లు ఖర్చుపెట్టించుచున్నది.

నసీ:—వైద్యమహాశయా ! నీవు ధర్మస్వరూపుడవు నీకు నిరంతరము పితృపిండ ప్రదాన స్మరణముతప్ప వేరుపనిలేదు. అట్టి నీ పెండ్లి చేయక వదలి పెట్టెదమా ?

గంగా:—వృద్ధాప్యమున భార్యలేకున్న గొంతుకలో గుక్కెడు నీరుపోయుటకును-తలలో పేలునుక్కుటకైన దిక్కుండదు. నెరసిన వెండ్రుకలకు చమురువ్రాయువా రుండరు.

ప్యారీ:—చూడు నాయనా ! ఈ వీధిలోని వారంతా నాపెండ్లి ప్రయత్నమును విని నవ్వుచుందురు.

గంగా:—వారి నవ్వులతోనేమి ? నీ పెండ్లిచేయుభారము మాది. ఈ సంగతి నితరులతో చెప్పవలదు. గోపాలబాబు మాకెన్నిప్పుడు చాల మిత్రభావముతో నున్నాడు. వెనుక మా

వలనగల్గిన తప్పును క్షమించినాడు. మాతోకలిసి మొన్న సారాయి సేవించినాడు.

ప్యారీ:— నేనుగూడ నతనితో చాలవరకు చెప్పితిని పైగా మును పటికన్న నతడిప్పుడు మిక్కిలి త్రాగుబోతైనాడు. ఇదుగో రూపాయలను తీసుకొనుము. వివాహము సత్వరమున జేయుము. వైద్యశాలలో గూర్చుండ నాకామె ముఖమే కన్పడుచుండును.

గంగా:—సాధ్యమైనంత త్వరలో నీ పెండ్లి జరుగును. అదృష్టవంతుడవు. మేమిక వెళ్ళివచ్చెదము. గోపాలబాబును కలుసుకొని పోయెదము.

నసీలాలు గంగారాములిర్వురు కుతూహల చిత్తులై బయలు దేరిరి. ఏబదిరూపాయల నిర్వాగుపంచుకొనిరని పాఠకులు గ్రహించియే యుందురు.

---

ఇరువదియవ ప్రకరణము.

—:o:—

## నీ వెవ్వరవు?

బాబూ! ఆముదుసలికి వివాహముజేయుటకు మాపాణముల దీయుచున్నాడు. ఎప్పుడైన గోపాలబాబునకే రహస్యము నతడెరింగించినచో చేసినపని యంతయు వ్యర్థమగును.

మోక్షదా! పెండ్లి చేయింపగలను గాని రెండుదినములాగవలయును. నేను మొన్న సరోజనితో ప్యారీలాలుకు వివాహమూడు విషయమై ముచ్చటింప నామె తిరస్కరించినది. కొంచెము బలవం

తము చేసెదను. సరియే కాని నే నిచ్చిన వస్తువు నా కెకిచ్చితివా ? అంగీకరించినదా ?

నేటి సాయంకాల మామెను తోటలోనికి గొనివచ్చెదను. మీరు సిద్ధముగ నుండవలయును.

అందుల కేమియు నభ్యంతరములేదు ఆమె పేరేమంటివి ? మోహిని. ఆహా ! పేరున కేగాక రూపమునకును జగన్మోహినియే. ఆమె స్వార్థీ మైనచో సరోజనిని మరచెదరు. సరోజని నీ దినమున బలవంతపరచియైన నొప్పించి ప్యారీలాలున కిచ్చి పెండ్లిచేసెదను.

ఈవిధముగ గదిలో గూర్చుండి పాపమూర్తియైన ప్రతాపుడు మోక్షదాతో ప్రసంగించుచుండ గంగారాము డాగదిలోనికివచ్చెను.

ప్రతా:—గంగారాం ! గోపాలబాబు నెచ్చటనుంచితివి ?

గంగా:—కుముదిని యింట్లో నిలువబెట్టితిని. ప్రక్కను పనీలాలు ఉన్నాడు. మొదట నంగీకరింపలేదు. వేశ్యాగృహమన్న నస హ్యాపడెను. స్వభావసిద్ధముగ నతడు చాలమంచివాడు కట్టు దిట్టములో పెరిగినవాడే ! ధనాపేక్షచే తమ్ముని మిగిలినవారి నందరిని వేరుపరచి తాను ప్రత్యేకముగ కాపురముండెను. అది మొదలికను యదృష్టదశ తొలగినది. ఏవిధముగనో తాగుట కలవాటుపడెను. అది వృద్ధియైనది. చిన్నబాబు గోవిందచంద్రుడున్నాడు అతని కిట్టి దురభ్యాసము లేమి యును లేవు. చివరకు పాగాకైన ముట్టుకొనడు. ఎంతయో బలవంతపెట్టి గోపాలబాబు నటకు బంపితిని.

మోక్ష:—అతనిని పూర్తిగ తాగించి మత్తువదలకుండజేసి యట నుంచుడు. నేను వెళ్ళి మోహినిని తీసుకొనివచ్చెదను. మూడు గంటలు కావచ్చినది.

ప్రతా:—పొమ్ము సారాయి చాలునా? కొంచెము డబ్బుకూడా

కావలయునా? అవసరమైనచో నిరువది రూపాయలను తీసి
కొని పొమ్ము.

గంగా:—ఇరువది రూపాయలు పోలీసు ఇన్‌స్పెక్టరుగారికే సరిపో
వును. మిగిలిన బంట్రోతుల నోరు కట్టవలయునుగదా ?

ప్రతా:—ఇదిగో నాతాళపుచెవి. అలమారు తీసి యందులో పది
రూపాయలు నోట్లు అయినున్నవి. వానిం గొనిపోయి పని
పూర్తిచేయుము. ఇన్‌స్పెక్టరు మన మెరింగినవాడే?

గంగా:—సబ్ ఇన్‌స్పెక్టరు మనచేతిలోనివాడే గాని క్రొత్తగా
సర్కిల్ ఇన్స్పెక్టరు వచ్చినాడు అతని పేరు శరచ్చంద్రబాబు.
అత డేమార్గములకు వచ్చువాడుకాడు చాల కఠినుడు.

ప్రతా:—భయములేదు. మరియొక వందరూపాయలు చేతబెట్టిన
సరిపోవును. పోలీసువారి కార్యదక్షత వారి న్యాయమార్గా
ను సరణము నే నెఱుంగనిదికాదు.

గంగా:—మే మొకమా రనుభవించుటచే చెప్పుచుంటిమి. వెనుకటి
గోపాలబాబుగారి యింటివిషయములో మమ్ములను జైలునకు
బంపుటకు సిద్ధపడినాడు గాని గోవిందబాబు చెప్పి వ్రదలిం
చెను. కాళీబాబు శరచ్చంద్రుని యెదుట మాటాడజాలడు.

ప్రతా:— నేనా కట్టుదిట్టము నంతయు జేసెదను. నీవు నేను చెప్పి
నట్లు చేయుము. సాయంకాలమైన తరువాత తోటలో నన్ను
గలియుము. గోవిందున కీవృత్తాంతము తెలియగూడదు.

గంగారాము వెడలిపోయెను. పోవుచు నిట్లనియె. గోవింద
బాబు కచేరీనుండి శనివారము సాయంత్రము వచ్చును నేడు బుధ
వార మగుటచే కలకత్తానుండి రాడు. అందుచే దీనికా విచారణ
మక్కర లేదు. వచ్చినను భయములేదు. అన్నదమ్ములకు మిక్కిలి
విరోధముగా నున్నది అన్నగారికి గల్గిన యాపత్తుకు తమ్ముడు సంత
సించునుగాని విచారింపడు అనిచెప్పి గంగారాము వెడలిపోయెను.

మోక్షదా ప్రతాపునితో సమయనిర్ధారణ మొనర్చి మోహినిదగ్గరకు పయనమై పోయెను.

ప్రతాపుడు సాయంకాలము తోటలోనికి గావలసిన సన్నాహము సిద్ధపరచుట్కై సేవకులబంపి సరోజని గదిలోనికి బోవుటకై లేచెను. ఇంతలో సరోజిని స్వయముగ వచ్చి ప్రతాపుని పాదములపైబడి యిట్లనియె స్వామీ! నేను మీ రౌనర్పబోవు కార్యక్రమమునంతయు వింటిని. నాప్రార్థనమును వినుడు. మీ రాపాపకార్యమున ప్రవేశింపవలదు.

ప్రతా:—వింటివా! నేనే నీతో స్పష్టముగ జెప్పదలంచితిని. ముందు నా ప్రశ్నమునకు జవాబిమ్ము. నీవు ప్యారీలాలును వివాహమాడెదవా లేదా?

సరో:—వివాహమా! ప్యారీలాలుతో వివాహమా? ఇదేమి?

ప్రతా:—నీవు వినిన దేమి? ఆదినమున నీవు చూచిన యువకుడే ప్యారీలాలు. నా యాజ్ఞచొప్పున నీ వాతని వివాహమాడి గృహిణివి కావలయును.

సరో:—నాస్థానమున నీ కొక నూతనప్రియురాలు రానున్నదా!

ప్రతా:—ఔను. రాగలదు. ఇప్పు డధికసంభాషణకు సమయము లేదు. ప్యారీలాలును వివాహమాడెదవా లేదా?

సరోజనియొక్క యురుకున వెనుకకుబోయి యిట్లనియె. జమీందారు మహాశయా! మీరు నన్నొక కులటనుగా భావించితిరా? పొరపాటు. నే నట్టి నీచురాలనుకాను. నా గ్రహచారవశమునజేసి మీరు చెప్పిన మాటలకు చేసిన బాసలకు చూపిన యాసలకు లోబడి తరంగములవలె వచ్చుచున్న విష యేంద్రియ వాంఛా పరంపరల నరికట్టజాలక మిమ్ము నమ్మివచ్చితిని. పెక్కురీతుల నమ్మించి తీసుకొనివచ్చితిరి. నే నిప్పుడెక్కడికి పోవుదును?

ప్రతా:—నేను నిన్ను గొనివచ్చితిని గనుక నే నీ వివాహము నాత

నితో సిద్ధపరచితిని. పెండ్లాడి సుఖింపుము. కావలసిన ధనం బొసంగెదను.

నరో:—నేను గౌరవనీయ కుటుంబమున జన్మించినదానను. భర్తృ సుఖము నెఱుంగని యమాయికనగుటచే ముందువెనుక లరయక నీ మోసమునకు జిక్కి యమూల్యమైన నా యభిమానధనమును నీకర్పించితిని. తల్లిదండ్రులు నాకు చిన్నప్పుడు చక్కగ విద్యాబుద్ధులు చెప్పించి యనురూపవరున కిచ్చి వివాహము చేసిరి. కాని నాదురదృష్టవశమున నాపతి పెండ్లియైన సంవత్సరమునకే మరణించుటంజేసి స్త్రీలకు భర్తయన నెంత పూజనీయుఁడగు పదార్థమో గ్రహింపజాలకపోయితిని. తుదకు నత్తమామలచే పరిత్యక్తనై మాతృపితృవిహీననై చూడ చుట్టములులేక దూరపు బంధుగురాలైన పెత్తల్లియింట తలదాచుకొనినన్ను ధనసుఖాపేక్షలచే మోసగించి యిట జేర్చితివి. ఇప్పుడెచ్చటకు పోగలను. నా ప్రార్థనమును వినుము నన్ను వెడలగొట్టకుము. ప్యారిలాలు పేరు నా యెదుట నెత్తకుము.

ప్రతా:—నీ వెనుకటి చరిత్రతో నా కవసరములేదు. నేను చెప్పినట్లు విని ప్యారీలాలును వివాహమాడితివా? నేను నీ కిదివరలో నొసంగిన నగలను నీ కిచ్చుటయేగాక ధనముగూడ నొసంగెదను. అంగీకరింపవేని - నే నొసంగిన నగలను తీసికొని కట్టుగుడ్డలతో వెడలగొట్టెదను నీవెట్లును పోవలసినదే.

నరో:—నాకు ధనాపేక్షలేదు. ఇప్పుడే నగల నిచ్చెదను తీసికొనుము నే నిట్టి దశలో నెచ్చటి పోగలను? నా కాశ్రయమిచ్చువారెవరు? నాకు సుఖముగాని ధనముగాని యక్కరలేదు. నీ వెట్లున్నను నాకు చింతలేదు. నన్ను మాత్రము వదలవలదు. దాసినై యుండెదను అంతియేగాని యీస్థానమును మాత్ర

ము ప్రాణములుండగా పరిత్యజింపను. ఇదియే నాకు గావల యును

సరోజిని నగలను దీసి యీయఁ ప్రతాపుకు దాఁచి గైకొనెను.

ప్రతా:—నీవు స్పృదువుగా చెప్పిన నంగీకరింపవు. తగినపని జరుగ వలయును. పొమ్ము. ఒక్క క్షణమైన నాయింట నుండ వలదు ఇంతకాలము నా యండనుండియు నన్ను గుర్తింప లేదా ?

తోక త్రొక్కబడిన యాఁడు త్రాచువలె సరోజిని నిట్టూర్పు విడుచుచు ప్రతాపునకు గొంచె మెడమై యిట్లనియె. గుర్తించితిని. చోరుడవని- కాపురుషుడవని లోకపీడకరుడవని- నరకకీటమవని గ్రహించితిని

ప్రతా:—నీచుడనా? దొంగనా? నా సొమ్ము దిని నన్ను నిందించె దవా? ఇంక నొక్క నిమునము నిలువనీయను. పొమ్ము. పోకున్న గెంటివేచెదను. ఇంత యీ ప్రేమ పిపాసాపీడిత యగు హృదయమునకు మోహిని అర్ధాంగి యగును. ఆమె రూపమాధురిం గ్రోలి పిపాసను దీర్చుకొందును. తెలిసినదా?

సరో:—ఆమె ఎంత నిర్భాగ్యురాలో ఏకాకినియై దీనయై యన్నపా నాదులకు గతిలేని నిస్సహాయురాలై యుండును లేకున్న యమూల్యరత్నమైన తన సతీత్వమును నీ కర్పించునా ?

ప్రతా:—ఈమారు నా యధనమునకు రానున్న కాంత నీవలె యనాధయైన వితంతువుకాదు. సువాసిని, శ్యామసుందర బాబు పెద్దకోడలు గోపాలబాబు భార్య మోహిని.

సరోజిని యామాటలను విని కుప్పకూలెను. కన్నీరుగార్చుచు ప్రతాప్! వలదు. వలదు. నీపవిత్రతనమును వదలుము. గొప్పయింటి కోడలైన మోహినియొక్క సతీత్వమును నాశనముజేయు దలంపకు ము. ముసలిదైన నా పినతల్లి కా కుటుంబ మాశ్రయమిచ్చెను

న్నది. గౌరవనీయుడైన గోపాలబాబు ముఖముజూచియైన బుద్ధిని మరల్చుకొనుము

ప్రతా:—చూచితివా? నా సామర్థ్యము ఇప్పుడైన నామాటను వినిప్యారీలాలును పెండ్లాడుము.

సరో:—అజ్ఞానమైన తెలియక త్రికరణశుద్ధిగ నిన్ను ప్రేమించి కులమును బంధువులను గూడ పరిత్యజించి వచ్చితిని. ఇప్పుడెక్కడికి పోగలను. ఇప్పటికి ఇకముందును- నిన్ను వదలి వేరొకరిని పెండ్లి యాడను. నీ ప్రేమజాలమున తగుల్కొని వచ్చినంతమాత్రమున నేను కులటను కాజాలను. కాను. నన్ను శాశ్వతముగ వదలివేయుదలంచితివేని చెప్పుము- నా దారిని పోయెదను.

ప్రతా:—ఎచ్చటికి బోయెదవు ?

సరో:—నన్ను పాపమార్గమునుండి తప్పించుటకు- నీవు చేయు దుష్కార్యములకు ప్రతిక్రియ సల్పుటకు-

ప్రతా:—అట్లనా? ప్రతాపునకు విరుద్ధముగా నిలువబడువాడు లేడు నీ లెక్కయేమి?

ప్రతాపుడు సరోజినియొక్క త్రోవ కడ్డముగ నిలువబడెను.

సరో:—దారి వదలుము. అందరు నీవలెనే మోసగాండ్రు లోక పీడాకరులుం కారు. కపటోపాయమున మోహినిని రప్పించుకొనుచున్నని వన్నుగడ యంతయు సర్వనాశనమునకే యని నిశ్చయింపుము. ఒక్కమాటను వినుము. స్త్రీల సతీత్వమన నీ వొక్క యాటవస్తువుగ భావించితివి. ప్రమాదము నీ తప్పును కనిపెట్టు వారనేకులు గలరు. ప్రపంచకము మునిగిపోలేదు. సూర్యచంద్రులు గతులు తప్పలేదు. పావనగంగా స్రవంతి ఇంకిపోలేదు. త్రోవను వదలుము. నే

నిప్పుడే గోవిందబాబుతో చెప్పి మోహిని సతీత్వమును రక్షించెదను.

సరోజిని వెలుపలికి బ్రోవ ప్రయత్నించెను.

ప్రతా:—ఊరకున్నకొలది మితిమీరి మాట్లాడుచుంటివే. ఒక కచేరీ గుమాస్తా పేరుచెప్పి నన్ను బెదరించుచుంటివా ? నేను వాని నొక తుచ్ఛునిగ దలంచుచున్నాను.

అని పల్కుచు సరోజని చేయి గట్టిగపట్టుకొనెను.

సరో:—తుచ్ఛుడవు నీవా గోవిందబాబో తెలుసుకొని మాట్లాడుము. పరస్త్రీ మానభంగకరుడవై-కాపురుషుడవై ధన మదమున బీదలనేడ్పించుచు త్రాగుబోతువైన నీవు-కన్న గానక-దీనరక్షకుడగు-కరుణాస్వభావుడగు-సద్గుణ సమంచితు డగు-ఏకపత్నివ్రతుడగు-గోవిందబాబును తుచ్ఛుడని పల్క దవా ?

ప్రతా:—పాపిసీ ! నీ ప్రాణములను దీసి కళేబరమును గంగలో బారవైచెదను.

అని యరచుచు జుట్టుపట్టుకొని నేలపై బడత్రోసెను. గాని సరోజని యెంతమాత్రము లక్ష్యముజేయక యిట్లనియె.

సరో:—నిర్భాగ్యుడా ! మృత్యుభయమును జూపెదవా ? భారత నారీమణు లభిమానముకొఱకు ప్రాణములను బలిగానొసం గుట నెరుంగవా ? నీచుడా ! ముందువెనుక లరయక నిన్ను నమ్మి కులగౌరవమును మంటగల్పుకొనిన నా స్వయంకృతా పరాధమున కీ సమయమున మరణమే ప్రాయశ్చిత్తము. మృత్యువున కానందదాయకముగాని దుఃఖకరముగాదు. నన్నుచంపక ముందొక్కమారు మోహినీదేవి నాకారాధ్య దేవతయగు తల్లియని పల్కుము. విని సంతసమున చనిపో యెద. బ్రహ్మానందముతో నీ బాకుపోటునకు నా ప్రాణముల

నిచ్చి నీ పాదములకడ మరణించెదను. భగవంతుడు మన యిద్దరు పాపములను క్షమించి నీకు సద్బుద్ధియు-నాకు సద్గతియు బ్రసాదించుగాక.

అని పల్కుచు సరోజని కటారును దీసి ప్రతాపుని యెదురుగ నిలువబడి తన వక్షస్థలమును కత్తిపోటునకు సిద్ధముగనుంచెను. సరోజినియొక్క యపూర్వమైన యాత్మత్యాగమును గాంచి ప్రతాపుడు నిశ్చారపడెను నాలుగడుగులు వెనుకకునై స్తంభితుడై సరోజని ముఖమును దీక్షగా జూచుచుండెను చూచుచున్నకొలది నతని కన్నులు నీరాలు పటుచుండెను.

ఆహా! ఇదేమి? ఆశ్చర్యముగానున్నది. నేటికైదు సంవత్సరములక్రింద వివాహమాడిన ధర్మపత్నిని బలాత్కారముగ పదాఘాతములచే జంపితిని. నా పాపకాలాలనత్వము చరితార్థము జేసికొంటిని నేటికామెయొక్క సర్వగుణసంపన్నమైన తేజోమయ ముఖమును నీయందు చూచుచుంటిని. ఆహా! నీ వెవ్వరవు? శిలాసదృశమైన నా కఠోరహృదయము కొట్టుకొనుచున్నది. సరోజనీ! రక్షింపుము. రక్షింపుము. నన్ను క్షమింపుము. అని పల్కుచు నామెను కౌగిలించుకొన వచ్చుచుండ వారిద్దరిమధ్య నొక ఛాయామూర్తి నిలువబడిన ట్లతనికి గోచరమయ్యెను. ప్రతాపుడా మూర్తిని గాంచి విస్మితుండయ్యెను. వెంటనే భయసంభ్రమములావరించుటచే చేతులుజోడించి యిట్లనియె. నిర్మలా! నీవు నిజముగ వచ్చితివా? లేక యిది ప్రేతాత్మయా! నన్ను భయపెట్టకుము. నా యపరాధములను మన్నింపుము. నేను నిన్నెంత కష్టపెట్టి నానావస్థలకు బాల్జేసినను నేను నీ భర్తను. రక్షింపుము.

ప్రతాపుడార్తనాదము జేయుచు నా ఛాయామూర్తి పాదములకడ కూలబడెను. ఛాయామూర్తి నోటినుండి యీ వాక్యములతని చెవులబడెను.

ఛాయా:— నే నిప్పుడు నిన్ను రక్షింపవచ్చితిని. ఒకానొకప్పుడు నేను నిన్ను దుష్పథమునుండి రక్షింపవచ్చి నీచే బలవంతముగ జంపబడితిని. తత్కారణమున నిట్లు పైశాచిక స్వరూపిణినై రాత్రింబవళ్ళు నిన్ననుసరించియుంటిని. ఇంకనైన నీవు నారీహత్య కొడిగట్టవలదు. నీ పరాక్రమమును సంపత్తిని పాపకార్యమున వ్యయపరచుచుంటివి. ఇకనైన నీ దుష్కార్యములను వదలుము-లెమ్ము. నీ కిది మహాయోగ దినము. అనాథుల కాశ్రయమైన అరక్షకుల కాధారమైన-దీనులకు కల్పతరువగు శ్రీ నారాయణ పాదపద్మములను భజింపుము. కృతార్థత నందెదవు. పల్కుము. మోహిని నాకు పూజ్యురాలు. హృదయాధిష్ఠాత్రియైన దేవీస్వరూపిణి. నాకు జనని యని నోరారబల్కుము.

ప్రతాపుడు కన్నీరుగార్చుచు భయంకర స్వరూపముతో నిట్లనియె. నేను త్రికరణశుద్ధిగ వచింపుచుంటిని. నేడుమొదలు మోహినిని లోకమాతృ స్వరూపిణియైన దుర్గాదేవియని తలచి పూజించెదను.

సరో:— ప్రతాప్! ధన్యుడవైతివి. నా హృదయశోకము తగ్గినది. ప్రతాపుడు చేతులుజోడించి నిర్మలా! నీ పవిత్రస్వరూపమును చూడజాలను. నే నింక పాపమార్గమున నడుగిడను. ఏ విధముగ నొనర్చిన నీకు ముక్తి కలుగునో తెలుపుము. అట్లు చేసెదను.

ఛాయాస్వరూపము ప్రత్యుత్తరము చెప్పక తనవెంట రమ్మని వేలితో సైగచేసెను. సరోజినీ ప్రతాపులు మంత్రముగ్ధులవలె ఛాయాస్వరూపమును వెంటనడచిరి.

———

ఇరువదియొకటవ ప్రకరణము.

—:o:—

# గోపాలచంద్రుని పతనము.

వనీలాలు-గంగారాములిద్దరు గోపాలచంద్రుని కుముదిని యను వేశ్యాగృహమునకు గొంపోయి గదిలో కూర్చుండబెట్టిరి. కుముదిని పాడుచుండెను. వారిద్దరును తలలూపుచుండిరి. గంగారాము సీసాయెత్తి గ్లాసును సారాయముతో నింపి గోపాలున కందిచ్చిరి. గోపాలబాబు దానిని పూర్తిచేసెను. కొంతకాలము సంగీతమును విని తరువాత గోపాలబా బిట్లనెను.

గోపా:—మిత్రులారా! నేనింక వెళ్ళవలయును.

గంగా:—అప్పుడే పోయెదవా? ఇంకొక రెండుపాటలువిని వెళ్లుము.

అని పల్కుచును గ్లాసుని నింపి గోపాలుని నోటికందిచ్చెను.

గోపా:—వలదు. నే నీ దినమున నధికముగ త్రాగితిని. మీకు పుణ్యముండును. నే నింటికి పోవలయును మనస్సంతయు నింటి మీదకు పోవుచున్నది.

కుముదిని:—మహాశయా! అంత తొందర పడెదవేల ఒకగంట ఆలస్యమైనచో నేమి మునిగిపోవును?

గోపా:—ఇప్పుడు వెళ్ళవలయును. రేపు తప్పక వచ్చెదను.

వనీ:—గోపాలబాబూ! కొంచెమాగి పోవచ్చును. నిలువుము.

గోపా:—నా మనస్సు సరిగాలేదు. ఇంటికి పోవలయును. మీరు బలవంతము జేసినను నిలువజాలను.

గంగా:—ఒక్క నిముసమాగుము. నే నిప్పుడే వచ్చి నిన్నింటివరకు బంపెదను.

అని పల్కి గంగారాము వెలుపలికేగెను. నసీలాలు గోపాలబాబుతో నేదియో ప్రసంగముల బుచ్చుచుండ గంగారాము అయిదారు నిముసములకు తిరిగివచ్చి యిట్లనియె గోపాలబాబూ! నీ వీ మార్గమునకు నవీనుడవు. ఇంటికి క్రమముగ జేరజాలవు. రమ్ము మేము నిన్ను దిగబెట్టి వచ్చెదము.

గోపా:—అట్లుచేయుడు. మీకు పుణ్యముండును. నే నధికముగ త్రాగియుండుటచే తల దిరుగుచున్నది

గంగా:—అందుకేమియు నభ్యంతరము లేదు రమ్ము.

ముగ్గురును నా మదిని యింటనుండి బయలుదేరిరి. కొంచెము దూరము నడచినపిదప దృఢకాయుడగు పోలీసు భటుడొకడు వచ్చి గోపాలబాబు చేయిపట్టుకొని యిట్లనియె. నీవు బాగుగా త్రాగినట్లు తోచుచున్నది. స్టేషనుకు రమ్ము. గోపాలబాబును పోలీసుభటుడు పట్టుకొనుట చూచి నసీలాలు గంగారాము లిద్దరును పారిపోయిరి. పోయెద రేమి? నన్ను వదలింపుడని గోపాలుడరచెను. కాని యతని మాటలను వినిపించుకొనకయే పలాయన సూత్రం బవలంబించిరి. గోపాలచంద్రుడు నిస్సహాయుడై రక్షకభటునిజూచి యిట్లనియె.

నన్ను వదలుము. నే నొక గౌరవనీయ కుటుంబమున జన్మించినవాడను. ప్రారబ్ధవశమున—కాదు కాదు—స్వయంకృతాపరాధమున నిట్టి స్థితికి వచ్చితిని. నన్నల్లరిపెట్టిన నీ కేమియు లాభము లేదు. వదలుము అని బతిమాలెను.

పో. భ:—నాకా సంగతి తెలియదు. వదలుటకు వీలు లేదు నడువుము. అని పల్కుచుండగనే నా ప్రదేశమునకు వేరొక పోలీసుభటుడు వచ్చి పలుకరించెను. లంపటసింగ్! రోడ్డు మీద గల్లంతు జరుగుచున్నదేమి?

లంప:—రాంసింగ్! వీడెవ్వడో త్రాగి యల్లరిచేయుచుండుటవలన పట్టి స్టేషనుకు దీసికొని పోవుచుంటిని

రామ:— ఇంకను తలగ్నము చేసినవేమి? కాళీబాబుగారు స్టేషనులో నున్నారు. తీసుకొనివెళ్లెను. పది దెబ్బలుగొట్టి జైలునకు నంపెదరు.

వారిమాటలనువిని గోపాలబాబునకు మితిలేని భయముకలిగి వారి పాదములపై బడి తన్ను వదలుమనియు కోరిన ధనమిత్తుననియు ప్రమాణము చేసెను.

రామ:— బాబూ! మేము లంచములను పుచ్చుకొనువారము కాము. నేటి దినమంతయు స్టేషనులో నుండవలెను. రేపు మీ బంధువు లెవ్వరైన వచ్చి జామీనుపై విడిపించుకొని వెళ్ళవచ్చును.

గోపాలచంద్రుని కానిస్టేబులు వారిద్దరివెంట స్టేషనుకు వెళ్ళెను. అతని కా సమయమున సోదరుడు జ్ఞప్తికివచ్చి యుల్లు తల పోసెను. సోదరా! గోవిందా! ఈ దుర్మార్గుల బారినుండి యన్నెన్నో మారు రక్షించితివి. అంతతో బుద్ధి తెచ్చుకొనక నిన్ను విడిచి యీ దుర్మార్గుల వెంట దిరిగినందులకు కారాగృహ ప్రాప్తికలిగినది. నీ వెందున్నావు? నేను దుష్టుడను. నీవు పవిత్ర స్వరూపుడవు. నా యవస్థ నీకు దెలిసిన నన్ను రక్షింపగలవు. నీకు తెలియు విధానమేది అని విలపించెను.

---

యిరువదిరెండవప్రకరణము.

—:0:—

## ప్యారీలాలు పరిణామము.

నవీలాలు గంగారాము లిద్దరు పోలీసుభటునితో రహస్యములాడి చమత్కారముగ గోపాలచంద్రుని స్టేషనుకుబంపి కుముదిని యింటికి వచ్చుచుండ మోక్షదా యెదురై పలుకరించెను.

మోక్షదా:—వెళ్ళినపని యేమైనది ?

గంగా:—అంతయు చక్కబెట్టితిమి. నేటిరాత్రి యంతయు గోపాలబాబు స్టేషనులో బంధింపబడియుండును. ఇందులకై కాళీబాబునకు పాతికరూపాయల నిచ్చితిమి పోలీసుభటులకు నాలుగురూపాయలు చేతబెట్టితిమి. దానితో సర్వము సంపన్నమైనది.

మోక్షదా:—నేను మోహినిని పిలుచుకొని రాబోయెదను. కొంత దూరము వచ్చిన తరువాత మెల్లగ బండియెక్కించి మెల్లగ తోటలోనికిం గొంపోవచ్చును. అందులకై వారు మధ్యాహ్నమున బండితో సంసిద్ధులై యుందురు.

మోక్షదా వెడలిపోయెను

పతి:—గంగా ! ఇక్కడికీపని పూర్తియైనది. పనిజరుగుట కేమియు నాటంకముండదు ఇంక ప్రతాపబాబు దగ్గరకేగి బహుమతిని తెచ్చుకొందము. దానితో కొన్నిదినములు నిర్వాహముగ గడుపవచ్చును.

గంగా:—నిశ్చయము. ఇట్టి జమీందారు లున్నంతవరకు మనవంటి నిరుద్యోగులకు సురాపానప్రియులకేమియును లోటులేదు. అదిగో ప్యారీలాలు వచ్చుచున్నాడు. అతనిని పలుకరింపవలయును.

గంగారాము కొంచెము ముందునకేగి ప్యారీలాలును కలుసుకొని పలుకరించెను.

గంగా:—డాక్టరుబాబూ ! ఎచ్చటికి బోవుచుంటిరి ?

ప్యారీ:—మీకొరకే వచ్చుచుండ త్రోవలోనే కనబడుట సంభవించినది. గోవిందబాబుగారి భార్య ప్రసవవేదన పడుచున్నదని చూడ బోయితిని. గోవిందగా బి [illegible] [illegible]. స్వర్ణమణి గోపాలబాబు కొరకు వచ్చినది. అచ్చట గోపాలబాబు

భార్యకు నాకును కలహము వచ్చినది. ఇంతలో మా మేనత్త నా దగ్గరకు వచ్చి అవసరముగా గోపాలబాబును పిలుచుకొని రమ్మని పంపినది. విచారింపగా నతడు మీతో నున్నట్లు విని మీ కొరకు వచ్చుచుంటిని.

వనీ:—వారిద్దరు పోట్లాడుకొనిన మధ్య మీ కేల ? గోపాలబాబుతో నేమి యవసరము వచ్చినది ?

ప్యారీ:—అవసరమున్నది. మాట్లాడవలయును. ఇప్పుడు కలిసికొనకున్న చాల నష్టము కలుగును.

వనీలాలు గంగారాము లిద్దరు నొకరినొకరు జూచుకొనిరి. కొన్ని కనుసైగలు జరిగెను.

గంగా:—అట్లయిన మా కోరండు గోపాలబాబును జూపెదము.

ముగ్గురుకలసి కొంతదూరము నడచిరి. లంపటసింగువచ్చి గంగారామును పలుకరించెను.

లంప:—గంగారాం ! పనియంతయు పూర్తియైనది. నేటిరాత్రి యంతయు గోపాలబాబిచ్చటనే యుండును. శరద్బాబుగారికి శరీరమున స్వస్థతగా లేదు. కావున నేటిరాత్రి స్టేషనుకురారు. యేదీ మా బహుమతి ?

ప్యారీలాలు అతని మాటలనువిని యనుమానపడెను.

ప్యారీ:—గంగారాం ? ఈ పోలీసుభటునకు బహుమాన మెందుల కీయవలయును ? గోపాలబా బెచ్చట నున్నాడు?

గంగా:—మహాశయా ! మరేమియును లేదు. తొందరపడకుము. ఇదంతయు మీ పెండ్లి ప్రయత్నము.

అని పల్కుచు లంపటసింహునకు కనుసైగ జేసెను. లంపట సింగా సైగను గ్రహించి ప్యారీలాలు చేతినిబట్టుకొని యిట్లనెను: అయ్యా ! దయచేసి స్టేషనుకు నడువుడు. మీ వైఖరిచూడ కొంగ వచ్చినట్లున్నది. గందరగోళము జేయుచుంటివి.

ప్యారీ:—గంగారాం! చూచు వీడెవడు? నన్ను తాగితినని చెప్పు చున్నాడేమి? నా యింట-నా వంశమున-నెవరును తాగు బోతులు లేరు. సుప్రసిద్ధవైద్యుని నన్ను తాగుబోతని పలు కుచున్నాడు కనుగొనుము.

గంగా:—వైద్యులే తరుచుగ తాగుచుందురు. పోలీసువారూరక అబద్ధమాడరు. నీ నోటివాసన చెప్పుటలేదా? మాట్లాడక స్టేషనుకు నడువుము. నేటి రాత్రి యంతయు అత్తవారింట నుండినయెడల పితృదేవతలకు పిండప్రదానము సిద్ధింపగలదు. పొమ్ము

ప్యారీలాలునకు మిక్కిలి కోపమువచ్చెను.

ప్యారీ:—పాపీ! ఏమంటివి? నా నోరు సారాయివాసన కొట్టుచు న్నదా? లుచ్ఛా! ఏమనివాగుచుంటివి? నేను త్రాగు బోతునా? చివరకు నా సొమ్ముంతయుదిని స్వామిద్రోహము జేయుచుంటివా? నీవు గోపాలబాబునకెట్టి మహోపకారముం జేయదలపెట్టితివో నే నెరుంగననుకొంటివా? నీ సంగతిని గోపాలచంద్రుడు తెలిసికొంచెదను. సిస్నహోయులను-నిరపరాధు లను పీడించు నీకు భగవంతుడు శీఘ్రమే ప్రాయశ్చిత్తముం జేయగలడు

లంపట:—మాట్లాడక స్టేషనుకు నడువుము. లేకున్న దెబ్బలుతగు లును.

వృద్ధుడైన ప్యారీలాలును గెంటుకొనుచు స్టేషనుకు గొనిపో యెను. గంగారామునవ్వుచు నసీ! మనరహస్యమా మునసలి వీని తెలిగించినది. మంచిపనియే జరిగినది. వీని నీ రాత్రియంతయు స్టేషనులో నుంచెదరు. మనపని కాటంకముండదు. రేపటినాటా లోచించు కొనవచ్చును ఏదియైన నాపత్తు వచ్చిన దో రక్షించుటకు కాళీబాబున్నాడు.

ఈవిధముగ మాట్లాడుకొనుచు వారిద్దరు ముందునకు నడచి వచ్చుచుండ గోవిందచంద్రుడు వెనుకనుండి వచ్చుచుండెను.

గోవిందుడానాడు స్వగృహమునకు వచ్చి దినము కాకపోయి నను శరీరమున స్వస్థత లేకపోవుటచేతను-శిరోభార మధికముగా నుండుటచేతను సెలవుదీసికొని యింటికి బయలుదేరెను. బయలు దేరిన బండి తప్పిపోవుటవలన వేరొకబండిలో ప్రయాణమయ్యెను. తత్కారణమున నాలస్యమయ్యెను. మార్గమధ్యమున వచ్చుచు నవీ లాలు గంగారాముల సంభాషణమును విని పలుకరించెను.

గోవిం:—గంగారాం ! కుశలమా ! ఈ దినమున మీ రెవరినో జైలుకు పంపినట్లున్నదే వారెవరు?

గంగా:—ఎవరువారు ? గోవిందబాబూ ! మీరా ! శిరమున గుడ్డ చుట్టుకొని యుండుటచే ఎవరోయని తలంచితిమి. నేటిదిన మున మీ అన్నగారి భార్యకును మీయింటి యాదువాండ్ర కును పెద్ద కలహమైనది. మీ అన్నగారు తనభార్యను వెనుక నైచుకొని మీ యాదువాండ్రను చావగొట్టినారు. ఆముసలి ప్యారీలాలు గూడ గోపాలబాబునకు తోడయ్యెను. మీవలన నుపకారమును పొందిన వారగుటచే కంటితో జూడజాలక మందలింపబోవ మమ్ము గొట్టవచ్చెను. పైగా మిక్కుటముగ త్రాగియుండుటచే పోలీసులిద్దరును పట్టి స్టేషనునకు గొని పోయిరి.

అనిపల్కి నవీలాలుతో పారిపోవ ప్రయత్నించెను.

గోవిందుడంతకుముందే లంపటసింగు ప్యారీలాలును లాగు కొని పోవుచుండ చూచి కారణ మడిగెను. లంపటసింగు తొందరగ పోవుచు ప్రత్యుత్తరమును సరిగా నొసంగక మీ సోదరుడుకూడ బంధింపబడినాడు అనిచెప్పి వెడలిపోయెను. తత్కారణమునను-నవీ లాలు గంగారాముల మాటలవైఖరిని బట్టి యసత్యమని గ్రహిం

చెను. యేదియో కుట్రజరిగెనని తలంచి పారిపోవ దలంచుచున్న గంగారాము చేయిపట్టుకొని యిట్లనియె.

గోవిం:—మంచిపని జరిగినది. విశ్వాసపాత్రులన్న మీరే. నాకింత ద్రోహము దలపెట్టినవాడు నాకు సోదరుడు కానేరడు. నేనే వానిని జైలుకు పంపియుందును. కాని మీరు నాపని తగ్గించితిరి.

గంగా:—సందేహమేమి ? గోపాలబాబు మీ విషయమున జేసిన యన్యాయమునకు మితిలేదు. అతని దుర్మార్గమును జూడ లేక పోలీసుల కప్పజెప్పితిమి.

గోవిం:—మంచిపని జరిగినది. వానికా ప్రాయశ్చిత్తము కావలసినదే.

గంగారాము-సుశీలాలుల కిద్దరికి గోవిందబాబు మాటలయందు నమ్మకము కుదిరినది. నిశ్చయముగ గోవిందు దన్నగారియందు బద్ధవైరమును బూనెనని నమ్మిరి.

గోవిం:—మీ ఉపకారము మరువజాలను. క్షేమముతో శరద్బాబుగారున్నారా ?

గంగా:—లేరు. ఇంటిలోనున్నారు.

గోవిం:—మీరీ తరుణమున కొంచెము సహాయము చేసినయెడల నేను వానిని కొన్ని సంవత్సరములవరకు శిక్ష వేయించెదను. మీరు యథార్థముగ జరిగినట్లుగ నీ వృత్తాంతమును శరద్బాబుగారికి చెప్పవలయును. నాకును అతనికిని ఎంత స్నేహమైనను కేవలము నేను చెప్పుట మంచిదికాదు. మాటచెప్పి మీరు వెళ్ళవచ్చును. ఇందులకు తగిన బహుమతి నిచ్చెదను.

సుశీలాలు గంగారాము లిద్దరును గోవిందునివలన కొంత లాభము కలుగగలదని నిశ్చయించిరి.

గంగా:—అందుల కభ్యంతరమేమి ? కంటికోమూయిన దానిని చెప్పుట కాటంకమేమియును లేదు.

గోవిం:—గా రతనిని యే నేరముకింద బంధింపజేసిరి ?

గంగా:—రాజవీధిలో త్రాగి యల్లరి చేయుచుండుటవలన.

గోవిం:—మంచిది రండు పోదము.

గోవిందుడు నసీలాలు-గంగారాములకు శరచ్చంద్రబాబు గృహమునకు గొంపోయెను.

---

ఇ రు వ ది మూ డ వ ప్ర క ర ణ ము.

—:O:—

# కుక్కకాటుకు చెప్పుదెబ్బ.

గోవిందబాబు చమత్కారముగా తన మాటలచే నమ్మించి నసీలాలు గంగారాములను వెంటగొని శరచ్చంద్రబాబు గృహమును జేరెను.

అకస్మాత్తుగ వచ్చిన గోవిందుని శరచ్చంద్రుడు పలుకరించెను. గృహసమాచారము లెట్లున్నవని ప్రశ్నించెను.

గోవిం:—ఆఫీసునుండి వచ్చుచున్నాను. ఇంకను ఇంటివృత్తాంతము తెలియదు.

శర:—నీకు తెలియకున్న నేనే చెప్పెదను. నీకు కుమార్తె పుట్టినదని వింటిని. మన ముగ్గురము వియ్యంకుల మగుటయే తరువాయి.

గోవిం:—ఒక్క రహస్యమైన సంగతిని వినుము. వీ రిద్దరును నీ
వెఱింగియే యుంటివి. నేడు నాకు మహోపకార మొనర్చి నా
కుటుంబమును రక్షించినారు.

శర:—నే నెఱుంగ కేమి? స్వభావముగా వీ రిద్దరు చాల పెద్దమను
ష్యులు. నీవలన నొకమారు మహోపకారమును పొందినాను.
అని సోదర వాక్యములతో వా రిద్దరను సంతుష్టిపరచి సావ
డిలో కూర్చుండబెట్టెను. వనీలాలు గంగారాముల బల్లపై
గూర్చుండ శరశ్చంద్రుడు గోవిందునితో వీధిలోనికి వచ్చెను.
తదుపరి రహస్యముగ గోవిందు డిట్లనెను. మిత్రమా! ఈ
దుర్మార్గు లిద్దరును గలసి మా యన్నగారిని వృద్ధవైద్యును
ప్యారీలాలును నిష్కారణముగా స్టేషనులో బంధించినారు.
నేను వీరిని నమ్మించి తీసుకొనివచ్చితిని.

శర:—పైసంగతిని చెప్పనక్కరలేదు. లోనికివచ్చి నీవుకూడ వారి
తోనుండుము. నే నిప్పుడు వచ్చెదను. అని పల్కుచు గోవిం
దబాబును వారి దగ్గర కూర్చుండబెట్టి పళ్లెరములో తమల
పాకులు వక్కలు సున్నము నుంచి తాంబూలము వేసికొను
డని చెప్పి తాను వెలుపలికేగెను. శరచ్చంద్రు డొనర్చిన
గౌరవమునకు వనీలాలు- గంగారాము లిద్దరు తన్మయులై
పోయిరి. తాంబూలమును సేవించుచు గోవిందబాబుతో
ముచ్చటలాడుచుండిరి.

శరచ్చంద్రుడు తన యధికారమును సూచించు దుస్తులతో
బయలుదేరివచ్చి మిత్రులారా! రండు గోపాలబాబు పని పట్టించె
దము అని పల్కుటయే తడవుగ బయలుదేరిరి. త్రోవలో శరచ్చం
ద్రుడు గంగారాముని జూచి గంగారామూ! గోపాలబాబు నే యపరా
ధముక్రింద బంధించి రను.

గంగా:—త్రాగి రాజవీధిలో యల్లరిచేయు నేరమున బంధించిరి.

శర:—చూడగ నాకు మీరుగూడ తొ్రగినట్లే కనబడుచున్నది. తలంచుకొనిన మిమ్ములనుగూడ జైలునకు పంపగలను.

నవీ:—బాబూ! మీరు పోలీసు అధికారులు నిర్దోషిని పట్టుకొనగలరు. అపరాధిని వదలగలరు.

శర:—అది లంచగొండులు చేయు పనిగాని పోలీసువారి ధర్మము కాదు. నేరస్థుని గురించి పట్టి శిక్షించునాడే పోలీసు ఉద్యోగియుడు. ఇందులకు దృష్టాంతముగ నిప్పుడే మిమ్ముల నిర్వురను బంధించుచుంటిని.

ఇట్లాలుచ శరచ్చంద్రుడా యిద్దరిచేతులను గట్టిగ పట్టుకొనెను. వ్యవహారము ముదురుచుండుట చూచి యాశ్చర్యపడి గంగారాము శరచ్చంద్రునితో నిట్లనెను.

ఇన్స్పెక్టరు బాబూ! మేము నిరపరాధులము. నన్యాయముముగా పట్టుకొనినారు కరుణించి వదలుడు అని పల్కుచు చేతులను విదిలించుకొని పారిపోవలయునని ప్రయత్నించిరిగాని సింహబలుడైన శరచ్చంద్రుని చేతికి జిక్కి పారిపోవుటకు వీలుకలుగునా? అంతేగాక వెనుక గోవిందుడు జాగ్రత్తతో నుండుటచే నా పని వారికి సాధ్యము కాలేదు.

శర:—శాస్త్రిబాబులారా! పారిపోవుటకు ప్రయత్నించుచుండిరి. మీరుచేసిన దుష్కర్మమే మిమ్ముల్ కిట్లు తెచ్చినది. వెనుక నొకమారు మీరు చేసిన పనిని క్షమించితిని. ఈమారు మీకు బహుమతి పూర్తిగ నిట్టుచెప్పెదను

గంగా:—గోవిందబాబూ! నమ్మినవారి గూర్చి ద్రోహము చేయుట ధర్మము కాదు. మీకొఱకే మేము గోపాలబాబును పోలీసుల కప్పగించితిమి. మీ కొరకు చేసిన మహోపకారములను జూచి జాలిక యట్లొనర్చితిమి తెలియదా మీకేమి? మమ్ము విడిచింపుడు మీకు పుణ్యముండును.

గోవిం:—గంగారాం! నీసంగతిగా నే నెఱుంగనిది కాదు. అన్న దమ్ములలో నెంతి విరోధమున్నను వా రెన్నటికిని అన్న దమ్ములే. రక్తసంబంధము ఏకమాతృగర్భజనిత సంబంధముతో కూడియుండుటచే సోదరు డెప్పుడును సోదరుడే. పరుడైన నీ వాతని కపకారము సేయ నేను దానిని హరించి యూరకుండుట తమ్ముడనగు నాకు ధర్మమా? మహాభారతములో ఘోషయాత్రాసందర్భమున దుర్యోధనుడు పాండవులను పరిభవింపవచ్చి గంధర్వులచేత పట్టుబడి నప్పుడు ప్రాంతమందున్న ధర్మరాజు సోదరులతో నేమి చెప్పెనో యెఱుంగుదువా? సోదరులారా! కౌరవపాండవులకు విరోధమున్నపుడు వారు నూరుగురు. మన మైదుగురము. పరులతో విరోధము వచ్చినపుడు మనము నూటయైదుగురము అని చెప్పలేదా! కావున నోరు మూసుకొనుడు. ఇంతియేగాక వృద్ధుడైన ప్యారీలాలును త్రాగినాడని చెప్పి జైలునకు బంపిన పుణ్యాత్ములు మీరు.

గంగా:—బాబూ! అతడు నిజముగ త్రాగినాడు.

గోవిం:—స్టేషనుకు నడువుడు. అచ్చోట నంతయు బయల్పడును.

ఈవిధముగ మాటాడుకొనుచు వచ్చుచుండ లంపటసింగు దూరమునుండి ఏమా గందరగోళము? అని యదలించుచు సమీపించి శరచ్చంద్రుని జూచి సలాముచేసి నిలువబడెను. సనీలాలు గంగారాములను జూచి తెల్లబోయెను.

శరచ్చంద్రుడు లంపటసింహుని జూచి వీరి నిద్దరిని స్టేషనుకు దీసికొనిపోయి బంధింపుము

లంపటసింహు డొక్కమారు వా రిద్దరివైపు జూచి వెంటనే యిద్దరును బంధించి స్టేషనుకు గొంపోయెను. శరచ్చంద్రుడును గోవిందుడు వారివెంటనే బయలుదేరిరి.

---

## ఇరువదినాలుగవ ప్రకరణము.

---

# సతీత్వరక్ష.

మోహిని శృంగారించుకొని మోక్షదాకొఱకు నిరీక్షించుచుండెను. మోక్షదాయొక్క చర్యలనుగురించి తనలో దాను వితర్కించుకొనుచుండెను.

ఈమె యెవరు? నన్నుజూచి యింత ప్రేమించుటకు కారణమేమి? వీధివారందరును తోడికోడలును జూచి పొగడుచుండ మోక్షదా నిందించుట కేమికారణము. ఆ ముసలివితంతువులన్న నీమెకు గిట్టదు. అదియునుగాక నా భర్త వచ్చినయెడల బలవంతముగా త్రాగింపుమనియు ఎచ్చటనో ప్రతాపబాబుగారి మేడలున్నవి తోటలున్నవి చూపెదను రమ్మని యింత ప్రయత్నము చేయుట కేమికారణము. ఇదంతయు కారణవాత్సల్యమా! లేక వేరు హేతువేమి? అని తర్కించుకొనుచుండ మోక్షదా వచ్చి మోహినిని జూచి నవ్వుచు ఆహాహా! నేటిదినమున నీ రూపము నీయందమాశ్చర్యమును గల్గించుచున్నది. సాక్షాత్కరించిన రంభవలె నుంటివి. మాణిక్యముల కుప్పవైన నిన్ను నీభర్త యింత కష్టపెట్టుటన్యాయము.

మోహి:—మోక్షదా! నీవేమో యనుచుంటివి గాని నాకెందులకో భయమగుచున్నది. గుండెలు కొట్టుకొనుచున్నవి.

మోక్ష:—ఛీ! ఛీ! భయమేమిటి? ప్రథమమున నట్లే యుండును. నేనుండ నీ కేమిభయము. వెనుక గ్రహణస్నానమునకు బోయినప్పుడు నీకా తోటలు చూపించలేదా! భయమేమిటి?

మోహి:—మనము వెళ్ళిన తరువాత నా భర్త వచ్చినయెడల నేమి కావలయును? ఆయన యేమనుకొనునో? ఏమో! నాకేమో భయమగుచున్నది. నేను నీతో రాజాలను.

మోక్ష:—ప్రతివారికిని ప్రథమమున నిట్టే భయము కలుగుచుండును. రెండుమూడుసారు లలవాటుపడిన వెనుక నుండదు. నీకిప్పుడు బాబునుగూర్చిన భయమక్కరలేదు. నాకు నిన్ను నిష్కారణుడై చానగొప్పనందులకు తగిన ఫలము నిప్పించితిని. అతని జైలులో బెట్టించితిని. ఈ రాత్రి గడచినగాని రాడు. ఇంక నీకా భయమక్కరలేదు.

తన భర్త జైలులోనున్న వార్తను విని మోహిని గడగడ వడకిపోయెను. సర్వాంగములు కంపించుచుండ కంపితస్వరముతో నిట్లనియె. మోక్షదా! ఏమంటివి? నాపతిని జైలులో బెట్టించితివా? నన్నేమి చేయదలంచితివి? నీచురాలా పతితిరస్కృతనైయున్న నా యసహాయదశను గనిపెట్టి పాపమార్గమున కీడ్వదలంచితివా? పాపీ! ఎవ్వరి ప్రోత్సాహము? గొప్పయింటి కోడలను మగనాలినగు నన్ను సర్వనాశము చేయుటకై నిశ్చయించితివా? చెడితిని. నిశ్చయముగ చెడితిని. నిర్భాగ్యురాలా! నీచురాలి మాట విని చెడితివని నాచెవిలో నెవరో చెప్పుచున్నారు. ప్రభా! ప్రభా! ఓ ప్రభా! అని యరచుచు నేడ్చుచుండెను. ప్రభావతి లోపలినుండి వచ్చి తల్లిని చూచి అమ్మా! యేడ్చుచుంటివేల? నాన్నగారింకను రాలేదా?

రంగము మారిపోవుటను గుర్తించి మోక్షదా యిక నటనుండిన ప్రమాదమని యూహించి మెల్లగ బైటికి నడుచుచుండెను. మోహిని చూచి కురంగము పైకి లంఘించు మాతంగమువలె నొక్కయుదుటున మోక్షదాపైబడి రెండుచేతులతో బంధించి ప్రభావతీ! నేను చాల నాపత్తులో నుంటినని చెప్పి స్వర్ణమణిని పిలుచుకొనిరమ్ము. అని చెప్పుటయే తడవుగ ప్రభావతి స్వర్ణమణిని

పిలువబోయెను. మోక్షదా మోహినియొక్క బాహుపాశమునుండి తప్పించుకొనవలయునని చాల ప్రయత్నించెను గాని కొంచెము వయసు మళ్ళుటచేతనో లేక జగన్మాతయైన చండికాదేవి యనుగ్రహముననో మోహినియొక్క భల్లూకతుల్యమైన బాహుబంధమును తప్పించుకొనజాలక పోయెను. చూచుచుండగనే ప్రభావతిని వెంట బెట్టుకొని స్వర్ణమణి యచ్చటకు వచ్చెను. మోహిని స్వర్ణమణిని జూచి యేడ్చుచు వదినే! రక్షింపుము. రక్షింపుము. నా తప్పులను మరచి రక్షింపుము.

స్వర్ణ:—ఏమివచ్చినది? ఆమెనేల గట్టిగ బంధించితివి?

మోహి:—ముందీ పాపాత్మురాలిని బంధింపుము. ఈ పాపివారిని సురాపానమత్తునిజేసి ఖైమలో పెట్టించినది. అంతతోగాక నన్నెక్కడకో తీసికొనిపోయి సర్వనాశనము జేయుదలంచినది. వదినే! నాతప్పులనుక్షమింపుము. పెద్దవారైన మిమ్ము వేరుజేసి పెద్దదిక్కును గృహమున లేకుండ జేసికొనినదుష్కార్యఫలిత మనుభవించితిని. పాపాత్మురాలను. నన్నుద్ధరింపుము.

స్వర్ణమణి తటాలున నా నిర్భాగ్యురాలిని బట్టుకొని యింటిలో నొక గదిలో పెట్టి తలుపును బంధించుచుండ మోక్షదా స్వర్ణమణిం జూచి అమ్మా! నా తప్పు లేదు. నన్ను తీసుకొనిపొమ్మని అడిగినది. అందువలన నట్లు చేసితినిగాని యామె యభిప్రాయమునకు వ్యతిరేకముగ జేయలేదు. నన్ను వదలుము. అని దీనముగ బల్కెను.

స్వర్ణ:—శరచ్చంద్రబాబుగారిని పిలిపించి వారు వచ్చినతరువాత వదలెదను. మోహినీ ! ఇంకేమియు భయము లేదు. నీ విచ్చటనే యుండుము. తలుపు తాళము దీయకుము.

అని పల్కుచు శరద్బాబుగారింటికి బోయెను. మోక్షదానిరుపాయమై యా గదిలో బంధింపబడెను.

---

ఇరువదియైదవ ప్రకరణము.

——:o:——

## బంధింపబడిన గోపాలబాబు.

ప్యారీలాలు గోపాలచంద్రు లిర్వురు పోలీసుభటులచే బంధింపబడి స్టేషనుకు గొంపోబడిరి. లంచగొండియైన కాళీబాబు విచారించక యీ జైలులోపడవేసి బంధించెను. కాళీబాబునకు నలుబది సంవత్సరములు వయస్సు చాలకాలము పోలీసుశాఖలో పనిచేసి విశేషధన మార్జించెను. యింతకుముందు వచ్చిన యధికారులందరు నొక్కరకమువారు గనుక కాళీబా బేమాటాడినను సాగెను. శరచ్చంద్రబాబు సర్కిలు ఇనస్పెక్టరుగా వచ్చినపిదప నితని యాదాయము తగ్గెను. కారణమేమనగా శరద్బాబు ధార్మికుడు. సజ్జనుడు, నసీలాలు గంగారాములిచ్చిన లంచములకు ఫలితముగ వారిద్వర నారాత్రి జైలులో బంధించెను. గోవిందబాబూరిలో లేడు. జామీా నిచ్చువారుండరు. పైగా శరద్బాబుగారికి సుస్తీగా నుండుటవలన నతనికిట్టి సమయము దొరకినది.

ఖైదుఖానా (జైలు) లో గోపాలచంద్రునకు ప్యారీలాలునకీ విధముగ సంభాషణము జరుగుచుండెను:

గోపా:—మీరు పొరబడినారు. అతడు గోవిందుడై యుండడు.

ప్యారీ:—దూరమునుండి చూచితిని. గోవిందుడని నా విశ్వాసము మాట్లాడుటకు వీలులేకపోయినది. అక్కడికిని ఊరకుండక కేకలు వేసితిని. నేను ప్యారీలాలును. నిర్దోషిని. నీవుకూడ నావదలో చిక్కుకొంటివి. అని యరచితిని. యేలరాలేదో తెలియుదు. అతనిభార్య ప్రసవవేదన పడుచున్నది.

గోపా:—గోవిందుడు రాకున్నను నే నాతని నేమియు ననజాలను. కారణమేమనగా నేను పెద్దవాడనై యుండియు నతనిని బాధించితిని. న్యాయముగ నతనికి రావలసిన పితృభాగము నీయక నే నపహరించితిని. కచేరీలో నతనికి జరుగు నవమానము ఉన్నతిని చూడజాలక నౌకరీనుండి తప్పించితిని ఆ దుష్కార్యములకు ఫలితము ననుభవించుచుంటిని. నెలకు రెండువందల రూపాయల మాసికవేతనము వచ్చు నౌకరీ పోయినది. ధర్మము-గౌరవము మొదలగు వాని కోల్పోయితిని. ప్యారీబాబా! ఇదంతయు వేరింటికాపురముండి ధనమును వృద్ధిచేయదలంచి నందులకు ఫలితమిది. ఇంకనైన భరతఖండ వాస్తవ్యులగు యువకులందరును వేరు అనుమాటను వదలి ఏకకుటుంబమున వర్ధిల్లుచు దీర్ఘాయుష్మంతులై పరస్పర కష్టములకు సుఖములకు శుభాశుభములకు సహాయులగుచు వర్ధిల్లునట్లు చేయవలయునని భగవంతుని ప్రార్థించుచుంటిని.

ప్యారీ:—గోపాలబాబూ! నేనుగూడ పశ్చాత్తాప బడుచుంటిని. నా వివాహాపేక్షయే నన్నీగతికి దెచ్చినది. సంతానహీనుని వలన స్వర్గీయ పితృపితామహులకు గతులుండవను మాటను నమ్మి పదిమంది చెప్పినవినక ముదిమిని పెండ్లాడ దలంచితిని. ఈ దుష్టులిర్వురు నాకు పెండ్లిచేసెదనని నమ్మించి నన్నీగతికి దెచ్చిరి.

ఇర్వురిట్లు మాట్లాడుకొనుచుండ జైలుఖానా తలుపులు తెరువబడెను.

గోవిందబాబు-శరచ్చంద్రబాబు-కాళీబాబు-చేతి సంకెలతో నసీలాలు గంగారాములు లోనికివచ్చిరి శరచ్చంద్రుని యనుమతిని లంపటసింహుడు ప్యారీలాలు-గోపాలచంద్రుల నీవలకుంగొనివచ్చెను.

గోవిందబాబు సోదరుని కౌగలించుకొనెను. గోపాలబాబు కన్నీరు విడిచెను.

గోవిం:—అన్నా ! నీకీ దుర్గతి యెట్లుకలిగెను ? సర్వమాన్యుడగు శ్యామసుందర వంధ్యోపాధ్యాయుని జ్యేష్ఠ పుత్రునకు కారాగృహప్రాప్తియా ? అదిగో శరచ్చంద్రబాబుగారు వచ్చినారు. జరిగిన సంగతి నెరింగింపుము. విరోధుల దండించును.

గోపాలబాబు తలను వంచుకొని వనీలాలు గంగారాములు తన్ను కుసుదిని యింటికి గొంపోయినదిమొదలు తుదివరకు జరిగిన కథనంతయు వచించెను. ప్యారీలాలుకూడ నిష్కారణముగ తన్ను బంధించిన సంగతిని నివేదించెను.

శరచ్చంద్రుడు లంపటసింహ-రామసింహులను జూచి-యిట్లనియె. లంచగొండులై త్రోవను బోవుచున్న పెద్దమనుష్యులను త్రాగుబోతులని పట్టినందులకు-నిజమైన త్రాగుబోతులను విడిచినందులకు మీ కిర్వురకు చెరియొక నెలజీతము జరిమానా విధింపవలసినదిగా సూపరెంటెండెంటుగారికి వ్రాసెదను.

ఈ మాటను వారిర్వురు శరచ్చంద్రుని పాదములపైబడి క్షమార్పణము గోరుచు కన్నీరుగార్చిరి. కాని లాభము లేకపోయెను. తదనంతరము కాళీబాబుతో నిట్లనియె.

శర:—కాళీబాబూ ! ఈ దురవస్థకంతయు కారకుడవు నీవుగా కన్పడుచుంటివి. గవర్నమెంటువారు మనకు జీతములిచ్చునది పెద్దమనుష్యులను దండించుటకును త్రాగుబోతులను వదలుటకునా ? పోలీసుభటులు తీసుకొనివచ్చిన మనుష్యులను విచారింపక వారి వారి వాఙ్మూలములను గైకొనక నిష్కారణముగ జైలులోనుంచితివి. గోవిందబాబు రాని

మొదల నేటిరాత్రియంతయు వారిద్దరిట బాధపడవలసినదే గదా ! ఇందుంగూర్చి కమీషనరుగారికి తెలియజేయ గూడదు.

శాలీ:—క్షమింపుడు ఇది ప్రథమాపరాధము. లేకున్న నా యిరువదేండ్ల సర్వీసు నాశనమగును. యింకమీద నెన్నడు నిట్టి పనులను జేయను.

శర:—సూర్యమల్లూ ! ఈ త్రాగుబోతుల నిద్దర జైలులో బంధింపుము. పారిపోకుండ జూచుచుండుము. వీరిపై మరియొక గొప్ప నేరమున్నది. అది కోర్టులో విచారింపబడును. గోవిందబాబూ ! ఆఫీసుగదిలోనికి రండు కూర్చుందము.

అందరును గదిలో కూర్చుండిరి. ప్యారీలాలు గోపాలబాబులకు గోవిందుడు జామీను పత్రమును వ్రాసియిచ్చెను. శరచ్చంద్రుడు జరిగిన వృత్తాంతమును డైరీలో వ్రాసుకొని వారిద్దరను వదలెను. ప్యారీలాలు గోవిందుని పెక్కుగతుల దీవించుచు యింటి కేగెను. గోపాలచంద్రుడు తమ్మునిజూచి గోవిందా! నేను మోహాంధుడనై సద్గుణఖనివైన నిన్నును మహాలక్ష్మియనదగు నీ భార్యను వేరుజేసిన ఫలము ననుభవించితిని. భగవంతుడు బాగుగ బుద్ధిచెప్పినాడు.

గోవిం:—అన్నా మీరుచాల శ్రమపడియున్నారు. యింటికేగి విశ్రమింపుడు నే నిప్పుడే వచ్చెదను.

గోపాలబాబు గృహమున కేగెను.



## ఇరువదియాఱవ ప్రకరణము.

—:o:—

# పాపమునకు ప్రాయశ్చిత్తము.

ప్రతాపు డావిధముగ ఛాయూస్వరూపము ననుసరించిపోయి యా స్వరూపము బోధించినరీతిగ తన జీవితకార్యక్రమము నంతయు మార్చెను. ప్యారీలాలున కీయదలంచిన సరోజనిని శాశ్వతముగా తన హృదయసామ్రాజ్యమున కధీశ్వరిగా జేసికొనెను. తాను చేసిన పాపకార్యములకు ప్రాయశ్చిత్తముగ ధర్మకార్యములకై ధనమును వినియోగపరచుటకై ప్రతిజ్ఞచేసెను. సరోజిని యాతని చిత్తవృత్తి మారుటకు బ్రహ్మానందభరితయై సత్కార్యములయం దతనికి నలవా నిచ్చుచుండెను. ఒకనాడు వా రిర్వురును యలంకరింపబడి గదిలో గూర్చుండి యిట్లు మాట్లాడుకొనుచుండిరి.

సరో:—ప్రతాప్! నామాట యదార్థమైనది చూచితివా? గోవింద బాబు తన శరీరమందలి బాధయు తన భార్యయొక్క ప్రసవవేదనయు విచారింపక మున్ముందు సహోదరుని విడుపించుటకై వెళ్ళియుండెను. అతని ధర్మబుద్ధి కిదియొక దృష్టాంతము.

ప్రతా:—నిశ్చయము. మన యార్యావర్తమందలి ప్రతి యువకుడును గోవిందచంద్రునివలె భ్రాతృభక్తియు సహనశీలత-శాంత్యాది సద్గుణసంపత్తి నలవరచుకొనవలెనని నా యభిప్రాయము.

సరో:—దైవయోగమున నీకా యపకీర్తి తప్పినది. లేకున్న శరచ్చంద్రునివలన నీకును కారాగృహప్రాప్తి కల్గియుండును. శరచ్చంద్రునివంటి న్యాయమూర్తియెదుట నీ ధన మేమియును పనిచేయదు.

ప్రతా:— నన్నా పాపకూపమున బడకుండ రక్షించి మృతప్రాయమైన నా శరీరమున నవీనచైతన్యము నవజీవనము నూతనశక్తిని ప్రసాదించిన పుణ్యస్వరూపిణివి నీవే. సరోజినీ! నాకింక నైహికసుఖవాంఛ తగ్గినది. నేను నా ప్రథమ కళత్రమగు నిర్మల నొకనాడైన సుఖపెట్టజాలక బాధించి బలవంతముగ జంపితిని. మొన్నటినుండి నన్నా పరితాపము దహించుచున్నది. నే నింకమీద నిర్మలయొక్క జ్ఞాపకార్థముగ నొక శివలింగమును ప్రతిష్ఠించి శివాలయమును నిర్మింపవలయునని యున్నది.

సరో:— చాల సంతోషము. మరియు నాదొక్క కోరికగలదు. యేమనగా! నేటినుండియు నీవు గోవిందబాబువలె దీనుల గాపాడుటయందును క్షుధార్తులకు అన్నదానము చేయుటయందును శాశ్వతదీక్షా బద్ధుడవై యుండుము. మరియు నీ భార్యయైన నిర్మలాదేవి నామము స్థిరరూపముగ నుండుటకై యొకపెద్ద సత్రమును గట్టించి దానికి నిర్మలాకేతనమని పేరుపెట్టుము. దీనులు-ఆర్తులు ననుబోలిన బాలవితంతువులు-రక్షకులులేని యనాథలు నా సత్రమున పోషింపబడుచు శాంతమయ జీవితమును ధర్మబద్ధముగ గడుపుచు నీచే నిర్మింపబడు శివాలయమున మహాదేవుని స్మరించి పూజింపుచు నిర్విచారముగ కాలము గడుపగలరు.

ప్రతా:— నీ యిష్టము నెఱవేరగలదు. ఆలస్యమేల? ఇప్పుడేపోయి ధర్మసంస్థాపనమునకు పునాదివేయుటకు శుభలగ్నమును నిర్ణయించెదను.

ప్రతాపచంద్రుడు వెడలిపోయెను. సరోజిని తనప్రియుని ధర్మప్రియత్వమును దలంచి యానందించుచు లోనికేగెను.

---

# ఇరువదియేడవ ప్రకరణము.

———:0:———

## పునస్సమ్మేళనము.

గోపాలచంద్ర గోవిందచంద్రు లిద్దరు గృహముజేరిన తదుపరి మోక్షదాయొక్క సంగతినివిని యామెనువట్టి శరచ్చంద్రుని కడకు బంప నతడామెను జైలులో నుంచెను.

ఇంతకాలమునకు గోపాలచంద్రుని గృహమున నానంద ముప్పొంగుచుండెను. సోదరులిద్దరు మనోమాలిన్య రహితులై మరల నేకకుటుంబముగ నుండుటకు స్థిరపరచుకొనిరి. తడసినగాని గుడిసె కట్టడను సామెత ననుసరించి మోహినీ గోపాలచంద్రు లిరువురును కష్టము లనుభవించిన తదుపరి తమ ప్రమాదములను గ్రహింపగల్గిరి. గోపాలబాబు వృద్ధ వితంతువులను సమీపించి వారలకు నమస్కరించి యిట్లనియె. తల్లులారా! కంటికిరెప్పవలె కాచు మిమ్ముల నేనాడు వదలితినో యానాడే నాకు దురవస్థ ప్రారంభ మైనది. మిమ్ములనందరిని వదలి భార్యాద్వితీయుడనై యున్నయెడల ధనము నెక్కువ కూడబెట్టగలనని తలంచినందులకు-ఫలితమేమనగా నౌకరీపోవుట ఇంటనున్నధనము పాడగుట-దుస్సాంగత్య ప్రభావమున దుర్వ్యశము నార్జించుట-సంభవించినది. ఇప్పుడు నేనుగూడ మీవలెనే గోవిందుని యాశ్రయింపవలసిన వాడనైతిని. నా తప్పులను మన్నించి నాయందు వెనుకటి యనుగ్రహము చూపుడు. అని వేడుకొనెను. స్వర్ణమణి యిట్లనియె.

స్వర్ణ:—నాయనా! చింతింపకుము. పెద్దవారమగు మే మెప్పుడును నిన్ను కనిపెట్టియే యుంటిమి. నౌకరీ పోయినదని చింతింపకుము. నేడుపోయిన రేపు లభింపగలదు.

ఈ సమయముననే గోపాల గోవిందుల సహోదరి సుశీల చూడవచ్చెను.

సుశీ:—అన్నా ! చింతింపనేల ? చిన్నన్నయ్య డైరక్టరుగారితో చెప్పి మరల నుద్యోగమిప్పించును.

గోవిం:—అన్నా ! మీరేమియు సంపాదించనక్కరలేదు. ఇంటిలో నుండి గృహమును సంభావింపుడు. భగవంతు డిచ్చుచున్నది మనకందరకును చాలును నే నార్జించినదానిని మీ చేతబెట్టెద. దానిని జాగ్రత్తతో ఖర్చుపెట్టుడు.

ఈవిధముగ మాట్లాడు కొనుచుండగ రామచరణుడువచ్చి పెద్దబాబూ ! మీ కొరకెవ్వరో వచ్చియున్నారు అని చెప్పుటచే గోపాల గోవిందులిర్వురు వెలుపలికిబోయిరి.

మోహిని సుశీలను కౌగలించుకొని వదినె ! నా యపరాధములను మరచిపొమ్ము. నిన్నును చెల్లెలైన కమలను పెక్కువిధముల కఠినోక్తులచే నొప్పించితిని. అహూయా పరవశనై మిమ్ము వేరుచేసితిని. అట్లు చేసినచో ధనమంతయు నిలువజేసికొనవచ్చును-మంచి మంచి నగలు చేయించుకొనవచ్చు నని యూహించి నంములకు నగలు లేకపోగా ధననష్టముకాగా-పాపాత్మురాలైన మోక్షదా మాటలను నమ్మి మోసపోయి మెడలోని నగలనిచ్చితిని. చేతులార పోగొట్టుకొంటిని. అనిపల్కుచు చిన్నపిల్లవలె వెక్కి-వెక్కి యేడ్చెను.

సుశీ:—వదినే ! దుఃఖింపకుము. ఈశ్వరానుగ్రహమున మీ రందరొక్క కుటుంబమై సంసారమును నడుపుడు. భగవంతు డన్నియు సమకూర్చును. చిన్నవదినెయైనను నీ మాట జవ దాటదు. స్వంతసోదరికన్న నధికమున ప్రేమించును.

కమ:—అక్కా ! గతించినదానికి వగవకుము.

మోహి:—కమలా ! క్షమింపుము. నీ వంటి సహనశీలమైన తోడికోడలు లభించుట పూర్వజన్మార్జిత పుణ్యఫలమని నేటికి గ్రహించితిని.

కమ:—అక్కా ! దుఃఖముచే పొఱలబడుచుంటివి. చిన్నదాననగు నన్నిట్లడుగరాదు. వెనుక జరిగిన దంతయు స్వప్నమువలె తలంపుము. ఇంటికి పెద్దదానవు. నీ యిల్లు నీ వాకలి నీ బిడ్డలు. ఇదివరలో నే నెన్నడును నీ మాటను జవదాటి యుండలేదు. ముందట్లుచేయను. సదా నీకు విధేయురాలను నన్నాశీర్వదింపుము. నేటినుండియు నీ యింటిని నీవు దిద్దుకొనుము. నేను నీ యాజ్ఞానుసారముగ సంచరించెద.

స్త్రీ లీ విధముగ మాట్లాడుకొనుచుండ గోవిందబాబు ప్రతాపుని వెంటబెట్టుకొని యటకువచ్చెను. అతనివేషము పూర్వమువలె లేదు. శిరమును ముండనము జేయించుకొని కాషాయవస్త్రధారియై రుద్రాక్షమాలాధరుడై యుండెను. స్త్రీలందరును మేలిముసుగులు సవరించుకొని దూరముగ నిలువబడిరి. గోవిందుడు ప్రతాపుని జూపుచు నిట్లనియె. ఒకానొకప్పుడీ యూరి స్త్రీ పురుషుల క్రోధమునకు బాత్రుడై కులస్త్రీలకు భయకారణుడై సంచరించిన జమీందారగు ప్రతాపచంద్రరాయుడు నేడు పరమయోగ నిష్ఠాగరిష్ఠునివలె మీ యెదుట నిలిచియున్నాడు. కాలగతి యెంత చిత్రమైనదో చూచితిరా ?

ప్రతా:—గోవిందబాబూ ! ధర్మతత్పరుడవగు నీ చరిత్రమే నను బోలు పాపాత్ముల కాదర్శము. తల్లులారా ! ఒకానొకప్పుడు నారకకీటకమువలె సంచరించిన ప్రతాపుడు మీ కందరకు

మ్రొక్కుచున్నాడు. జమీందారీయంతయు ధర్మమునకు విని యోగపడుచున్నది. ఈ దుష్టునకు పుణ్యగతులు గలుగునట్లు దీవింపుడు.

ప్రతాపు డటనున్న స్త్రీలందరకు సాష్టాంగ నమస్కార మాచరించెను. గుణదా, స్వర్ణమణి-పద్మమణి కృష్ణవేణి-మోహిని కమల-సుశీల మొదలగు వారందరు ప్రతాపుని పరివర్తనము జూచి యాశ్చర్యపడిరి.

స్వర్ణ:—ప్రతాప్! మే మందరమును నీకు పరమేశ్వరానుగ్రహము కలుగుగాక యని నిండు మనస్సుతో దీవించుచుంటిమి.

ప్రతా:—అమ్మా! పద్మమణీ! నీ విషయమున మహాపరాధమును జేసితిని. మీ సహోదరి పుత్రికయగు సరోజనిని మీ యందరి ప్రేమలనుండి తొలగజేసి మోసపుచ్చి నా స్వాధీనము జేసుకొంటిని. కాని నేటి నా యీ మార్పంతయు నా నారీమణివలననే కలిగినది. ఆమె పెక్కువిధముల బోధించి భయపెట్టి గోవిందబాబు నాదర్శపురుషునిగా గ్రహింపుమని చెప్పినది. నే నిప్పుడొక్క శివాలయప్రతిష్ఠనుజేసి నా ప్రథమ కళత్రము పేర నిర్మలానికేతనమను పెద్ద సత్రమును గట్టింప సంకల్పించితిని. గోవిందబాబూ నన్నాశీర్వదింపుము.

గోవిం:—ప్రతాపబాబూ! నన్నొక పెద్దచేయవలదు. ఈ బ్రహ్మాండమందలి యనంతకోటి జీవరాసిలో నేనొక క్షుద్రప్రాణిని.

పద్మ:—ప్రతాప్! ఇదివరలో నీ చరిత్ర మెట్లున్నను నేడు పశ్చాత్తాపతప్తుడవై ధర్మపథాను చరుడవగుటచే పవిత్రుడవైతివి.

వ్రేలాపు డందరి యనుమతిగైకొని వెడలిపోయెను. గోవిందుడు సోదరుడు మొదలగు స్త్రీజనమునుజూచి యిట్లనియె. పూజ్యులైన నాన్నగారి యనుగ్రహమున నాకు తెలిసినదానిని చెప్పుచుంటిని. శరీరములు క్షణభంగురములు. పుట్టినప్రాణి చావక తప్పదు. సత్యము-ధర్మము-ఈ రెండే శాశ్వతమై చిరస్థాయిగ నుండును. కావున మనమందరమును-జ్ఞానము నార్జించి ధర్మకర్మాచరణ తత్పరులమై-ధర్మప్రాణులమై ధర్మబద్ధులమై-ధర్మభ్రష్టులము కాకుండ-దైవమును సాక్షిగనెంచుకొని జీవితములను గడుపవలయును. ఇదియే నామనవి. ఈశ్వర వాక్యము నొక్కమా రందరమును స్మరింతము.

యతోధర్మ స్తతోజయః
సత్యమేవ జయతేనానృతం.

ఆ వాక్యములు-ఆ సుభాషితములు-రెండు నట నున్నవా రందరి నోటినుండి బయలువెడలి దిశలు మారుమ్రోగెను.

---

# ఉపసంహారము.

## పా ప పు ణ్యా ప రి ణా మ ము.

న్యాయస్థానమున విచారణము జరిగినది. నసీలాలు గంగారాముల దుర్మార్గముల నన్నింటిని శరచ్చంద్రబాబు ఋజువుచేయుటచే వారిద్దరకు పదేండ్ల కఠినదరకము విధించిరి. మోక్షదాయొక్క నేరము తక్కువ కావున నామెను కనికరించి రెండేండ్లు కఠినశిక్ష విధించిరి. మోక్షదా జైలులోనుండి తానొనర్చిన పాపముల దలంచి నిరంతరము దుఃఖించుచుండును. పవిత్రాపుని యందు పడిపోవుటచే నసీలాలు-గంగారాములు తప్పు నంగీకరించి శిక్ష ననుభవించు చుండిరి. పవిత్రాపుడు కొలదికాలములో శివాలయమును ప్రతిష్ఠించి నిర్మలానికేతనమును పూర్తిచేసెను. సరోజనితో గలసి పవిత్రాపుడిహలోకవైషయిక వాంఛలను క్రమక్రమముగ వదలి శివాలయమున గూర్చుండి ధర్మచర్చ-భక్తిమార్గము నవలంబించెను. సరోజని పేదవారికిని-ఆర్తులకును సేవజేయుచు తన జీవితమును-నిర్మలానికేతనమున గడపుచుండెను. గోపాలబాబు కొలది దినములలో సత్సాంగత్యప్రభావమున కృతార్థుడై గోవిందుని యాధారమున మరల నౌకరీ సంపాదించెను. ఈవిధము గోవిందగోపాలబాబు లిద్దరు తిరిగి తమయింట తండ్రినాటి కీర్తిని నిలువబెట్టిరి.

పాఠకులారా! వేరింటి కాపురప్రభావమును గమనించితిరా? ఏకకుటుంబముగా నుండుటవలన గల్గులాభమునుగూడ యోజింపుడు. మాకింక సెలవు.

స్వస్తిశ్రీ శ్రీ శ్రీ

---

# భీష్మ బ్రహ్మచారి.

(సోమరాజు రామానుజరావుగారు.)

బెజవాడ మైలవరం బాలభారతీసమాజమువారిచే పలుసారులు ప్రదర్శింపబడి పండిత పామరజనులచే నేకగ్రీవముగ స్తుతింపబడి, మొన్నడు ముద్రింపబడి యాంధ్ర సారస్వతమున కలంకారమగునాయని యెదురుచూచుచున్న భీష్మబ్రహ్మచారి యిప్పటికి ముద్రింపబడినది! మహాభారత వీరవృద్ధుడును, కౌరవపాండవ పితామహుడును, బ్రహ్మచారియునగు భీష్మునిచరిత్రము జన్మము మొదలు మరణమువరకు వ్రాయబడినది. శంతనునకు తన పెంపుడు బిడ్డయగు సత్యవతినిచ్చి వివాహము చేసిన రాజబంధువుడనిపించుకొనిన దాశవంశీయప్రభువును, అనాగరిక శిఖామణియునగు దాశరాజు "నాకు చానా కోపమొచ్చింది మంత్రీ!" అని పలుకుచు రంగస్థలమున ప్రవేశించిన హాస్యఘట్టము మొదలు, ముఖ్యకథకు మధ్యమధ్యను వచ్చు దాశరాజు హాస్యరంగములన్నియు మహాద్భుత హాస్యరస పరిపూరితములై దాశరాజు [illegible] గానములను రాజు—రాణి నడుమ బ్రవర్తిల్లిన అనాగరిక ప్రణయకలహములును, కాశీరాజస్వయంవర మంటపమున దాశరాజు అగ్రాసన మధిష్ఠించి "[illegible] ఉగ్గావచ్చిన పాపా పోయినాడా" అని పలుకుటయు, మంత్రి—[illegible] ప్రతిమాటకును "అంతే అంతే" పలుకుటయు [illegible] నవ్వించుచుండును. గంగాశంతనుల వివాదమునందు [illegible], భీష్మప్రతిజ్ఞయందు గంభీరమైనపితృభక్తియు—స్వయంవరరంగమున శృంగార[illegible]ను, పరశురామ ప్రవేశమున భయానకమును, అంబా[illegible], అగ్నిప్రవేశములయందు బీభత్సరసమును, విచిత్రవీర్యమరణఘట్టమున శోకరసమును తుదచిప్పిల్లి చదువరుల నువివిధ భావములందు ముంచియెత్తుచుండును. [illegible] చమత్కార శ్లేషాగ్రయుక్తమై—నిముషలోన పారవశ్యమును గలిగించుచు [illegible] పిలువనంపినప్పుడు శ్రీకృష్ణుడు భానుమతికి [illegible] జేసిన చమత్కృతికి హర్షప్రపుల్లాంతరంగులయితీరును. భీష్మార్జునుల సంగ్రామము భయదాయకమై—భీష్మపతనముతో నాటకమునకు భరతవాక్యము చెప్పబడును. చక్కని పాటలు—రసవంతములగు పద్యములుగల్గి—ఆంధ్రదేశమునందలి ప్రతిపట్టణమునందును ప్రదర్శింపబడి పేరుగాంచియున్నది.—పత్రికాధిపతులు చక్కని అభిప్రాయములనొసంగియున్నారు నేటికి నాటకము వెలువడియున్నది. వెంటనే [illegible]సిన అభినందును 8 చిత్రపటములతో శోభిల్లుచున్నది. అమూల్యమైన ముద్రణము. సర్వాంగ సుందరమై ఆర్టుపేపరులో ముద్రింపబడిన ప్రథమాంధ్రనాటకము. రు 1-0-0